THE ANDHRA PATRIKA - MADRAS.

8 పేజీలు వెల 1 అణా. హోలి 0-1-2.

చేనేత పరిశ్రమ అభివృద్ధికై మిల్లులు మూసివేయడానికైనా సిద్ధమేనని రాజాజీ

—8 వ పేజీ

# ఆంధ్రపత్రిక

హైదరాబాదులో మోటార్లు, పెట్రోలుల పై సుంకాల హెచ్చింపు

—5 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 330 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. గురువారము 5-3-1953

# రష్యా నియంత మార్షల్ స్టాలిన్ అత్యంత ప్రమాదస్థితి

## పక్షవాతం వచ్చి నోరు, కుడికాలు, చెయ్యి పడిపోయినట్లు మాస్కో రేడియో ప్రకటన



## సోమవారం నుంచీ స్పృహ లేదని వివరణ: క్రెమ్లిన్‌లో ప్రత్యేక నిపుణుల చికిత్స

లండన్, మార్చి 4: సోవియట్ రష్యా నియంత మార్షల్ జోసెఫ్ స్టాలిన్‌కు సోమవారం తెల్లవారుజామున శిరోనాళాలు బద్దలై పక్షవాతం వచ్చిందనీ, ఇవ్వాళ (బుధవారం) తెల్లవారుజామున 2 గంటలవరకూ కూడా ఆయన అత్యంత ప్రమాదకరమైన స్థితిలోనే వున్నారనీ మాస్కో రేడియో నేడు ప్రకటించింది.

"సోమవారం తెల్లవారుజామున స్టాలిన్ క్రెమ్లిన్ లోని తన అగారంలో వుండగా ఈ ప్రమాదం సంభవించింది. శిరోనాళాలు బద్దలై మెదడు మధ్యభాగం దెబ్బతిన్నది. అందువల్ల కుడికాలూ, చేయీ పడిపోయాయి. స్పృహా, మాటా కూడా లేకుండాపోయినవి," అని ఆ రేడియో ప్రకటించింది. స్టాలిన్‌కు ఇప్పుడు 74 ఏండ్లు.

ఉత్తమ భిషగ్వరులు స్టాలినుకు వైద్యం చేస్తున్నారనీ, శ్వాసలోనూ, రక్త ప్రసరణలోనూ కనిపించిన అస్తవ్యస్థతను సరిదిద్దడానికి వలసిన చికిత్సలు చేస్తున్నారనీ, రక్త ప్రసరణకు ఇంతవరకూ విఘాతం కలగలేదనీ, మంత్రి మండలి, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీల నిరంతర పర్యవేక్షణ క్రిందే చికిత్స జరుగుతోందనీ ఈ ఉభయులూ ఒక ప్రకటన చేశారు.

టాస్ వార్తాసంస్థ ప్రసారం చేసిన వైద్యప్రకటన ప్రకారం స్టాలిన్‌కు శ్వాస సరిగా ఆడటం లేదు. నిమిషానికి 36 పార్లమాత్రం ఊపిరి పీలుస్తున్నారు దానిగమనం కూడా చాలా వక్రంగా వుంది. మధ్యమధ్య ఊపిరితీసే కాలంలో చాలావ్యవధి కానవస్తోంది. నాడి నిమిషానికి 120 సార్లు కొట్టుకొంటోంది. అది కూడా చాలావక్రంగానే వుంది. హృదయస్పందనం 220-120 వుంటోంది. టెంపరేచరు 100.8 వుంది శ్వాస, రక్తప్రసరణల సందర్భంలో ప్రాణవాయువు కొంత కనిపించింది.

స్టాలిన్‌కు జబ్బుచేసి చాలా బలువుగా వున్న సన్న వార్త నేడుదయం మాస్కో పత్రికలన్నిటిలోనూ మొదటి పేజీలలో మామూలుగా ప్రధాన వ్యాసాలు ప్రచురింపబడే తావులలో ప్రచురింపబడింది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, మంత్రిమండలీ సంయుక్తంగా చేసిన ప్రకటనలో నే యీ సమాచారం వుంది. క్రెమ్లిన్

స్టాలిన్ తాత్కాలికంగా దీర్ఘకాలం ప్రభుత్వాధినేతృత్వానికి దూరంగా వుండవలసి వస్తుందనీ, ఈ కాలంలో సోవియట్ ప్రజ అత్యంత ఐకమత్యము, దృఢమైన దీక్ష, మెలకువ కలిగివుంటారను తమవిశ్వాసమనీ వారా ప్రకటనలో అన్నారు.

సోవియట్ రేడియో గానీ, పత్రికలుగానీ స్టాలిన్ ఆరోగ్యంగురించి వార్తలివ్వడం ఇదే మొదలు. సోవియట్ నాయకులు ఎవరైనా మరణిస్తే ఆ సమాచారం ప్రకటించడమే గాని, ముందుగా వారికి సుస్తీ చేసినట్లు తెలిపే ఆచారం నాటికిలేదు.

స్టాలిన్ దైహికంగా, మానసికంగా కూడా చాలా బలంగా, ఆరోగ్యంగా వున్నారని 15 రోజుల క్రితమే ఆయనను కలుసుకొన్న భారతరాయబారి కె. పి. మీనన్ అనివున్నారు. ఆయన వ్యాధిగ్రస్తుడయాడన్న వార్త ఇవ్వాళే అకస్మాత్తుగా వెలువడింది.

స్టాలిన్ ఆరోగ్యం గురించి రోజూ ప్రకటించబడుతుందని మాస్కో రేడియో ప్రకటించింది. ఇవ్వాళటి వైద్య ప్రకటనలు కనిపించిన వైద్యుల పేర్లు ఇదివరలో క్రెమ్లిన్ నుంచి వెలువడిన ఏ ప్రకటనలోనూ లేవు.

స్టాలిన్‌కు జరుగుతున్న చికిత్సను పర్యవేక్షిస్తున్న వారిలో క్రెమ్లిన్ ఆరోగ్యపాలనాశాఖ డైరెక్టరు ఇవాన్ ఇవానోవిచ్ కూపెరిన్ కూడా వున్నారు. ఈయన లోగడ మంత్రిగా వున్నారు. గత మాసంలో చనిపోయిన రష్యాలోని యూదు ప్రముఖుడు వెల్ జహరోవిచ్ హాలిలిస్ పోస్ట్‌మార్టం సర్టిఫికెట్ పై ఈయన సంతకం చేశారు.

ఈ విషయమై గంటగంటకూ మాస్కో రేడియో చేస్తున్న ప్రకటనలో ఎక్కడా స్టాలిన్ స్థానే ఎవరు వ్యవహరిస్తారో ఏమీ తెలుపలేదు.

ఆయన తర్వాత ఆ పదవి వహించగలవారుగా ఇద్దరి పేర్లు తరచు ఉదహరింపబడుతున్నాయి.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సీనియర్ సెక్రటరీ జార్జి మాలెంకోవ్ (51), సీనియర్ డిప్యూటీ ప్రీమియర్ వ్యాచస్లావ్ మొలటోవ్ (63).

## పంతుళ్లకు భూమి

లక్నో, మార్చి 3: ఉత్తర ప్రదేశ్‌లో మొత్తం 85 వేలమంది ప్రాథమికోపాధ్యాయులున్నారు. ప్రభుత్వం ఇప్పుడిచ్చిన ఉత్తరువుల ఫలితంగా వీరందరికి భూములు లభించనున్నవి.

## మిల్లుగుడ్డ అమ్మకం నియమాల సడలింపు: ప్రభుత్వ ప్రకటన

బొంబాయి, మార్చి 3: ధరల కంట్రోలు నిబంధనలు, పంపిణీ నిబంధనలు వర్తించని వస్త్రాలను స్వేచ్ఛగా తదితర వస్త్రాలతోపాటు గుడ్డల అమ్మకం లైసెన్సులున్న వ్యాపారస్థులందరికీ మిల్లులు అమ్మవచ్చునని ప్రభుత్వం యీవేళ ఒక ప్రకటన చేసింది. ఆయా వ్యాపారస్థులవద్ద ఏయే తరగతుల గుడ్డల అమ్మకం లైసెన్సులు వున్నవనే వివక్షతకూడా ఇకముందు ఈ విషయంలో పాటించబడదని కూడా యీ ప్రకటన స్పష్టపరుస్తున్నది. మిల్లుగుడ్డల అమ్మకం, ధరలు, పంపిణీల విషయంలో ప్రభుత్వం లోగడ అమలు జరిపిన పద్ధతుల ఫలితంగా మిల్లుగుడ్డలు ఇప్పుడు పుష్కలంగా లభిస్తుండడమే ఇప్పటి నిబంధనల సడలింపుకు కారణమని కూడా ఆ ఉత్తరువు వివరిస్తున్నది. (పి. టి. ఐ.)

## దక్షిణ హైద్రాబాదులో చెరువుల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ

### —ప్లానింగ్ కమిషన్ లేఖ

(స్వకీయ విలేఖరి)

న్యూఢిల్లీ, మార్చి 3: హైదరాబాదులో క్షామనివారణకు అవసరమైన నిర్మాణాలలో తుంగభద్ర ప్రాజెక్టు ముఖ్యమైనదని, దానిని పూర్తిచేయటానికి కావలసిన ధనసహాయాన్ని కేంద్రప్రభుత్వం సత్వరమే చేయాలని కొంత రామమూర్తి సంఘం సిఫారసుచేసిన సంగతి పాఠకులకు విదితమే.

హైదరాబాదు దక్షిణ ప్రాంతంలో ఏ ఏ చెరువులను మరమ్మతు చేయాలో, వేటిని అభివృద్ధి చేయవచ్చునో తెలియజేయమని ప్లానింగ్ కమీషన్ వారు హైదరాబాదు ప్రభుత్వానికి వ్రాసినట్లు తెలుస్తోంది.

## పర్షియా రాజధానిలో అరాచక పరిస్థితులు

### ప్రధానమంత్రికి ప్రతికూలురైనవారందరి నిర్బంధం

టెహరాన్, మార్చి 3: క్షణ క్షణం పెరిగిపోతున్న ప్రదర్శనలను అణచివేయడానికి ప్రధాని మొసాదిక్ తీవ్రచర్యలు తీసుకుంటూవున్న కొద్దీ వేళంటా అరెస్టులు అధికమవుతూ వున్నవి. మాజీ మంత్రులు, ఒక రాష్ట్రీయ మాజీ సేనాని, కొందరు సెనెట్ సభ్యులు, సేనానులు రెండువందల మంది కమ్యూనిస్టులు, అయిదుగురు పత్రికావిలేఖరులు పోలీసులచే నిర్బంధింపబడినారు.

ప్రధానమంత్రి మొసాదిక్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి కుట్ర పన్నారని 470 మంది పేర్లతో పర్షియా ప్రభుత్వ భద్రతా సంఘం ఒక జాబితా ఆమోదించింది.

అజర్బయిజాన్ మాజీ సేనాని మార్షల్ షహాబ్ ఖస్రో, లోగడ ప్రతికూలుడై నాయకుడుగా వున్న అమూల్ ఇమామ్, మాజీ ఆర్థికమంత్రి హుస్సైన్ అల ఇంతవరకూ అరెస్టుచేయబడిన వారిలో ప్రముఖులు.

ప్రస్తుత పర్షియా సర్వసేనాని గా వున్న మార్షల్ అమీర్ అహమ్మద్ జనరల్ గార్డ్లను కూడా అరెస్టు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

కమ్యూనిస్టు ప్రదర్శకులు మజ్లిస్ పైపుగా నినాదాలు చేస్తూ వెళ్తుండగా పోలీసులు ప్రదర్శనలను చెదరగొట్టి 200 మందిని అరెస్టు చేశారు. ఈ ప్రదర్శనలను ప్రభుత్వం నిషేధించి వుంచెను.

మజ్లిస్ భవనాలకు టాంకులు, సాయుధ సైనిక దళాలు కాపలా కాస్తున్నవి. పోలీసులు, కాపలా సైనికులను మినహాయిస్తే మజ్లిస్ ప్రాంతం నిర్మానుష్యంగా వుందని చెప్పవచ్చు.

ప్రధాని మొసాదిక్ లిఖితపూర్వక విశ్వాసాన్ని ప్రకటింపవలసిందిగా మజ్లిస్‌ను కోరాడు. మజ్లిస్ అంగీకరించినట్లు లిఖిత ప్రజల విశ్వాసాన్ని పొందడానికి చర్యలు తీసుకోగలనని హెచ్చరించాడు. మజ్లిస్‌ను కొనసాగనిస్తున్న సేనాని కలనల్ ... లిఖిత ఆ పదవిలో వుండనిస్తే మజ్లిస్ సమావేశం కావలిసి వుంటుందని ... ప్రధానమంత్రికి వ్రాసినాడు. ... మజ్లిస్‌లో సభ్యులకు ... కొందరికి ... అయితే ... లేఖలో తెలియజేసినారు.

## అనాథబాలుని పట్ల గవర్నరు సానుభూతి

నెల్లూరు, మార్చి 3. గవర్నరు శ్రీ శ్రీప్రకాశ యీవేళ సాయంకాలం నెల్లూరు అనాథ శిశుశరణాలయము రజతోత్సవం సందర్భంలో మహాత్మాగాంధీ కస్తూర్బా చిత్రపటములను ఆవిష్కరించుచూ శరణాలయంలోని ఒక అనాథ బాలునికి ఒక సంవత్సరంపాటు ఆ య్యే ఖర్చులను తాము భరిస్తామని ప్రకటించారు. ఆంధ్రరాష్ట్రం విడిపోయినప్పటికీ ఏడాది పర్యంతం యీ ఖర్చును మాత్రం తాము భరిస్తామని వాగ్దానం చేశారు. (స్వ. వి.)

## ఆంధ్ర ప్రాంత అప్పు వాటాలో 2½ కోట్లు మినహాయింపు

### వాంఛూ చేసిన సిఫార్సు: కట్జూ ప్రకటనకు ఆంధ్రుల హర్షం

(స్వకీయ విలేఖరి)

న్యూఢిల్లీ, మార్చి 4: ఆంధ్ర రాష్ట్రం విషయంలో కేంద్రప్రభుత్వ నిర్ణయాలు అయిదు లేక పదిరోజులలో వెలువడగలవు. గనుక అంతవరకు ఆంధ్ర మిత్రులు ఓపికపట్టాలని కేంద్ర హోమ్ శాఖమంత్రి డాక్టరు కైలాసనాథ్ కట్జూగారు నిన్న కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభలో చేసిన ప్రకటన ఇక్కడి ఆంధ్రులకు చాలా ఆనందం కలిగించింది.

ఆంధ్రపత్రిక లోగడ ప్రకటించినట్లు ఆంధ్రరాష్ట్రం విషయంలో కేంద్రప్రభుత్వ నిర్ణయాలు, కాంగ్రెసు కార్యవర్గ నిర్ణయాలు దాదాపు ఒకేసారి వెలువడగలవని తెలుస్తున్నది.

#### వాంఛూ సూచనలు

ఆంధ్రులకు పరిహారంగా సుమారు రెండున్నర కోట్లరూపాయలు చెల్లించాలని వాంఛూ తన నివేదికలో సూచించినట్లు తెలుస్తున్నది. రాష్ట్ర విభజన సందర్భంలో ఉమ్మడిరాష్ట్రంలో చేయబడిన అప్పులో ఆంధ్ర రాష్ట్రంపై పడే అప్పువాటాలో యీ రెండున్నర కోట్ల రూపాయలు తగ్గించబడాలని శ్రీ వాంఛూ సూచించారట.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు వారు కోరినట్లు 50 కోట్ల రూపాయలు ఆంధ్రులకు పరిహారంగా యివ్వవలసివస్తే మొత్తం ఈనాటి మద్రాసు నగరాన్ని ఆంధ్ర రాష్ట్రానికి కావాలంటే తొక్కట్టి పెట్టవలసివస్తుందని కూడా న్యాయమూర్తి వాంఛూ తన నివేదికలో ప్రభుత్వానికి సూచించారట. అంటే అది అంతటి అసమంజసమైన కోరికన్నమాట. ఏమైనా మొత్తంమీద కొంతసొమ్ము ఆంధ్రులకు పరిహారంగా లభించాలనే విషయం మాత్రం సుస్థిరపడింది.

## "ఆంగ్లభాష మనకు సరస్వతీ వరప్రసాదం"

### దాన్ని వదలరాదని రాజాజీ హితవు

మధుర, మార్చి 3: ఆధునిక శాస్త్ర విజ్ఞానానికి నిలయమైన ఇంగ్లీషు భాషను అనవసరమైన విద్వేషాలతో వదులుకోవద్దని మధుర కాలేజి 64 వ వార్షికోత్సవంలో ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు విద్యార్థుల నుద్బోధించారు.

విదేశీయులైన బ్రిటిష్ వారి పరిపాలనతోపాటు వారు తెచ్చిపెట్టిన భాషనుకూడా వదులుకోవాలనడం వివేకం కాదనీ, సరస్వతీ వరప్రసాదమైన ఆంగ్లభాష ఇంగ్లీషువారి దనడం అవివేకమనీ రాజాజీ ఆ సందర్భంలో అన్నారు.

బ్రిటిష్ వారి హయాములో మన నదులకు అనేక ఆనకట్టలు నిర్మించబడినవి. వారు మనదేశంనుంచి వైదొలగడంతో ఆ ఆనకట్టలను మనం వదులుకోలేదు. అదేవిధంగా అనేక హంగులు, సొంపులు గల ఆంగ్ల భాషనుకూడా మనం వదులుకోరాదనీ, ఆ భాషను ఇంకా చక్కగా నేర్చుకోవడానికి విద్యార్థులు కృషి చెయ్యాలనీ రాజాజీ పుద్బోధించారు.

ఇంగ్లీషు భాష ప్రపంచానికంతటికీ చెందినదనీ, ఏదో కాకతాళీయంగా మనం ఆ భాషను ఇంగ్లీషు వారివద్ద నేర్చుకోవడం జరిగిందనీ, ఇంగ్లీషు గ్రంథాలలోనే మానవ విజ్ఞానానికి సంబంధించిన విషయాలు చక్కగా వ్రాయబడి వున్నవనీ రాజాజీ వివరించారు.

బ్రాహ్మణులు జన్మతః బిచ్చగాండ్రు. కనుకనే ఇటువంటి విద్యాసంస్థల నిమిత్తంవారు విరాళాలకోరకు ఇతరులను యాచించగలిగారు. ఆత్మగౌరవం లెక్కచేయకుండా మరెవరూ ఈవిధంగా విద్యాసంస్థల నిమిత్తం యాచించలేరు. కనుక సుబ్రహ్మణ్యంగారు ఈ కాలేజి నిమిత్తం విరాళాలు సేకరించిన పద్ధతిలో ఇకముందుకూడా విరాళాలు సేకరించి అవసరమైన సంస్థలకు విరాళాలివ్వమని ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను."

## ఉత్తరప్రదేశ్ ఉపాధ్యాయుల సత్యాగ్రహోద్యమం

లక్నో, మార్చి 3: మరి ముగ్గురు ప్రాథమికోపాధ్యాయులు ఈవేళ లెజిస్లేటివ్ కౌన్సిలుభవనం ఎదుట అమరణ ప్రాయోపవేశం ప్రారంభించారు. ఈవిధంగా ప్రాయోపవేశం సాగిస్తున్న ఉపాధ్యాయుల సంఖ్య నేటితో 11 అయింది. ఈ 11 మందిలో నలుగుర్ని చికిత్స నిమిత్తం ఆస్పత్రిలో చేర్పించారు.

జీతభత్యాలు పెంచాలని ఈ ప్రాథమికోపాధ్యాయులు సాగిస్తున్న యీ సత్యాగ్రహం ప్రారంభమై ఇవాల్టికి తొమ్మిదిరోజు లయింది.

ఈలోగా ఉపాధ్యాయులు ఈవిధంగా ప్రాయోపవేశం సాగిస్తున్న ప్రాంతాన్ని వారు వదిలివెళ్ళాలని ప్రభుత్వోద్యోగులు ఉత్తరువు లిచ్చారు.

రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం సభ్యులు శ్రీ బీర్ సింగ్ రాణాయా ఉత్తరువులను గురించి మాట్లాడుతూ తమ ఉద్యమం అణచివేయడానికి ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలన్నింటినీ తాము ధిక్కరించగలమనీ తమ కోరికలు నెరవేరేవరకు ఉద్యమం సాగించి ప్రభుత్వాన్ని నిర్బంధపరచగలమనీ అన్నారు.

## ప్రభుత్వపు ఖర్చుల తనిఖీకి ప్లానింగ్ కమీషన్‌లో ఒక శాఖ

### అవసరమని రాజ్యసభలో హృదయనాథ కుంజ్రూ సూచన

న్యూఢిల్లీ, మార్చి 3: భారత ప్రభుత్వం చేసేఖర్చును తనిఖీచేసి, ఖర్చుకు తగ్గఫలితం కనిపిస్తోందో లేదో కనిపెట్టి వుండేందుకు ప్లానింగ్ కమీషన్‌లో ఒకశాఖను ఏర్పాటుచేయాలని డాక్టర్ హృదయనాథకుంజ్రూ నేడు రాజ్యసభలో సూచించారు.

బడ్జెట్ పై రెండవరోజు చర్చలో పాల్గొంటూ, ఆర్థికమంత్రి పంచవర్ష ప్రణాళిక ఖర్చును రాష్ట్రాలపై పంచడంలో వాటి సామర్థ్యానికంటే ఇష్టానిష్టాలకే అధిక ప్రాధాన్య మిచ్చినట్లు కనిపిస్తోందన్నారు. రాష్ట్రాలకు అభివృద్ధివిషయమై ఆసక్తివున్నా కేంద్రానికి చూపవలసినంత సహకారం చూపడం లేదన్నారు.

డాక్టర్ ఎం. డి. డి. గిల్డర్ బొంబాయి ప్రభుత్వ మద్యనిషేధాన్ని సమర్థించారు. వైనాతో నల్లమందు వ్యాపారం నిలిపివేసినందువల్ల భారత ప్రభుత్వానికి 20 లక్షలు నష్టమనీ, ఆర్థికమంత్రికి ఈ విషయం తెలుసుకోగలవయస్సు ఇంకా వచ్చివుండదనీ అన్నారు. రాజస్థాన్ సభ్యుడొకాయన మరీ వెనకబడివున్న రాష్ట్రాలకు విద్యాభివృద్ధి నిమిత్తం ఎక్కువ సహాయం చేయాలన్నారు. సౌరాష్ట్రకు చెందిన ... బడ్జెట్‌లో విద్యకూ, ఆరోగ్యానికి చాలా తక్కువ కేటాయించారన్నారు. ప్రాతినిధిక విద్యావిధానాన్ని ఎక్కడో వివరించి డబ్బు కొల్లగొడుతున్నారనీ దేశాభివృద్ధి సర్వోదయ మార్గాననే సాధ్యమనీ అన్నారు. కొమ్మారెడ్డి సూర్యనారాయణగారు మొదలైనవారు మాట్లాడాక సభ వాయిదా పడింది.

## అల్లరిమూకలపై పాక్ పోలీసుల కాల్పులు

### లాహోరులో టాంకుదళాల పహరా: అహమ్మదీయ వ్యతిరేకాందోళన ఉధృతం

లాహోరు, మార్చి 3: నేటి మధ్యాహ్నము సియాల్ కోటలో అహమ్మదీయ మతస్థులకు ప్రతికూలంగా ప్రదర్శనలు చేసిన అల్లరిమూకపై పోలీసులు తుపాకులు కాల్చారు. ఒకడు మరణించాడు. చాలామంది గాయపడ్డారు.

ఈ మూక అహమ్మదీయులకు, జఫరుల్లాకు, ప్రభుత్వానికి ప్రతికూలమైన నినాదాలు చేస్తూ దుండగాలు చేశారు. నాలుగు పోలీసు మోటార్లకు నిప్పంటించారు. చాలామంది పోలీసు కానిస్టేబుల్సుకు గాయాలు తగిలాయి.

గుజరన్‌వాలాలో కూడా పోలీసులు ఆవేశపూరితులైన అల్లరిమూకపై తుపాకులు కాల్చాల్సివచ్చిందని వార్త వచ్చింది. ఎవ్వరికీ గాయాలు తగలలేదు. కొద్దిమంది పోలీసులకు గాయాలు తగిలాయి.

లాహోరులో టాంకులు, పోలీసులు వీథులలో కాపలా కాస్తున్నారు. 144 సెక్షన్ను ఉల్లంఘించి జిల్లా కోర్టుయెదుట, నీలాగుబొంద్ ఎదుట చేరి ప్రదర్శనాలు చేస్తున్న మూకపై పోలీసులు బాష్పవాయువు ప్రయోగించారు.

జఫరుల్లాకు, ప్రభుత్వానికి ప్రతికూలంగా నినాదాలు చేస్తున్న అనేక జట్టులను పోలీసులు అరెస్టుచేశారు.

నిన్న ప్రజలు సాయంగా ప్రవర్తించారని, నాగరిక ప్రజలు వ్యవహరించాల్సినట్లు వ్యవహరించలేదని, అతి కఠినమైన చర్యలు అవసరమైనవని ప. పంజాబు ప్రభుత్వ అధికారి ఒకడు అన్నాడు.

నగరమునందలి అనేక ప్రాంతాల్లో 144 సెక్షనును ఉల్లంఘించ ప్రజలు ఉద్యుక్తులైవున్నారు. ఆ ప్రాంతాల్లో ఉద్రిక్త పరిస్థితి యేర్పడింది.

ఢిల్లీగేటు వెలుపల ప్రజలు బహిరంగసభ జరిపి జఫరుల్లాను బర్తరఫ్ చేయాలని కోరారు. ప్రభుత్వాన్ని కూడా వారు విమర్శించారు. అఖిలపక్ష ముస్లిమ్ సమితివారు ఉపన్యాసాలు చేశారు.

#### భరతపూరు

ప్రత్యక్ష చర్యలో పాల్గొనడానికి కరాచి వెళ్ళకూడదని భరతపూరు జిల్లా కమిషనరు వ్యక్తులకు, సంఘాలకు ఉత్తరువు జారీ చేశాడు. ఇక్కడ ప్రదర్శనలు పూర్తిగా ఆగిపోయినవని పాక్ ప్రభుత్వం ప్రకటించింది.

కరాచీలో నాలుగురోజుల నుంచి జరుగుతున్న ఆందోళనలో నిన్న మధ్యాహ్నంవరకు దాదాపు 30 మందిని కస్టడీలోనికి తీసుకున్నారు.

లాహోరుకు బయలుదేరి వెళ్ళిన పూర్వపు పంజాబునందలి అనేక ప్రదేశాల్లో అహమ్మదీయ ప్రతికూల వాలంటీర్లను అరెస్టు చేసినట్లు వార్తలు వస్తున్నవి.

## అనాథ శరణాలయ స్వాగత పత్రం

### ఆర్థిక సహాయానికై గవర్నరుకు విజ్ఞప్తి

నెల్లూరు, మార్చి 3: మద్రాసు ప్రభుత్వంవారు రాష్ట్రంలోని జీవాలయాధికారులు అనాథశరణాలయాలు ఏర్పాటు చేసి నిర్వహించాలని సూచించుచున్నట్లుగా తమకు తెలిసినందున అదేవిధంగా యిక్కడవున్న అనాథ శరణాలయాన్ని కూడా నిర్వహించాలని కోరుతూ గవర్నరు శ్రీ ప్రకాశ్ గారు డిక్కడ మీనమ్మ హరిజనబాలికల వసతిగృహ ప్రారంభోత్సవం జరుపు సందర్భంలో, శరణాలయ కమిటీవారు ఒక విజ్ఞప్తిపత్రం సమర్పించారు. స్థానిక సంస్థలు అనాథశరణాలయాలకు విరాళాలిచ్చుటకు అనుమతించాలనీ, జిల్లాకొక అనాథశరణాలయం చొప్పున ప్రభుత్వమే స్వయంగా నడపాలనీ వృత్తిపాఠశాల నిర్మాణాని కనుమతించాలని కూడా వీరి విజ్ఞప్తి పత్రంలో కోరారు. ఈ పత్రంలో శరణాలయం పూర్వచరిత్రకూడ వివరించారు.

#### పూర్వ చరిత్ర

నెల్లూరులో నవంబరు 1927 లో భయంకరమైన తుపానువీచింది. జిల్లా మెడికల్ ఆఫీసరుగారు తుపానువీచిన మరునాడు రోడ్డుప్రక్కన ఒక అనాథ శిశువును చూసి దగ్గరకుతీశారు. ఆయన సూచనపై పురప్రముఖులు అనాథ సేవక సమితి స్థాపించారు. మహాత్మాగాంధీ గారు 1929 లో దీనిని సందర్శించారు. 1930 లో శరణాలయంవారు ఒక ప్రాథమిక పాఠశాల స్థాపించారు. క్రమంగా అందులో 130 మందిదాకా చేరారు. 1941 లో మున్సిపాలిటీవారు స్థలం మంజూరుచేశారు.

ప్రముఖులసహాయంవలన ప్రస్తుతం పున్న శరణాలయ భవనాలు నిర్మించుకున్నారు.

## గూడూరు మైకాగనులు

### గవర్నరు సందర్శనం

నెల్లూరు, మార్చి 3: మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ్ గారు యీఉదయం కారులో నెల్లూరునుండి బయలుదేరి రాపూరు తాలూకాలోని మైకా అభ్రకంగనిని దర్శించారు. గని యజమాని శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య నాయుడు, గోగినేని వెంకటేశ్వరరావు గారలు గవర్నరుగారికి స్వాగతమొసంగి పూలమాలలు వేశారు. మార్కెస్‌ప్రసాద రావు గారు గవర్నరుగారిని గనిచుట్టు తీసుకొనిపెళ్లి గనిలోని వివిధ భాగములను చూపించారు. తరువాత గవర్నరుగారు గనిమండి వెలుపలికి వచ్చి వెంటిలేటింగ్ ఫ్యానుకు స్విచ్ వేసు ప్రారంభోత్సవం జరిపారు.

శ్రీయుతులు గోపాలరెడ్డి, టి. రామిరెడ్డి, డి. దశరథరామయ్య ప్రభృతులు కూడా గవర్నరువెంట వచ్చారు. గని యజమానులు అనంతరం అతిథులకు పానీయమిచ్చారు. ఈ అభ్రకం గని వల్ల ప్రభుత్వానికి నెలకు దాదాపు 9 వేల రూ.లు ఆదాయము వస్తుంది. ఇక్కడ నెలకు 50 వేల యూనిట్ల విద్యుచ్ఛక్తి వాడబడుతున్నది. నెలకు 8 లక్షల పౌనులు ముడి అభ్రకం దీయబడుతుంది. దీనివల్ల ప్రభుత్వానికి నెలకు 2 నుంచి 3 వేల రూ.ల వరకూ రాయల్టీ వస్తుంది.

ఇక్కడినుండి గవర్నరువారి పరివారము గూడూరు వెళ్లారు. గూడూరులో ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీ దర్శించి అనంతరం గూడూరు మున్సిపల్ సన్మానపత్రం అభ్రకం గనుల యజమానులసంఘ స్వాగత పత్రం స్వీకరించారు.

## ఆంధ్ర ఆయుర్వేద విద్యా పీఠ పరీక్షలు

విజయవాడ, మార్చి 2: పరీక్షా కార్యదర్శి కంభంమెట్టు విష్ణువర్ధన రావుగారిలా తెలుపుతున్నారు:–

"పై విద్యాపీఠ పైద్య విద్వాన్ పరీక్షలు యీ నెల 18 వ తేదీనుంచి పాలకొండ, బొబ్బిలి, విజయనగరం, ఏలూరు, పిఠాపురం, తణుకు, ఏలూరు, నూజివీడు, విజయవాడ, రేపల్లె, ఒంగోలు, ఆత్మకూరు, సుంటికల్లు, కర్నూలు, నంద్యాల, హైదరాబాదు, నర్సారావుపేట కేంద్రములయందు జరుగును. గురువుల ద్వారా వచ్చిన దరఖాస్తులకు సంబంధించిన పరీక్షార్థుల సన్నుతి పత్రికలు గురువులకును, సరాసరి పంపిన దరఖాస్తుదారుల సన్నుతి పత్రికలు సరాసరి పరీక్షార్థులకులు పంపబడినవి. పరీక్షార్థులు గమనించవలెను.

## ఆంధ్ర రైతు-కూలీ-ప్రజాపార్టీ సమావేశం

విజయవాడ, మార్చి 2: ఆంధ్ర రైతు కూలీ ప్రజాపార్టీ కార్యదర్శి శ్రీ నన్నపనేని వెంకట సుబ్బయ్య గారిలా వ్రాస్తున్నారు.

ఆంధ్ర రైతు - కూలీ - ప్రజాపార్టీ జనరల్ బాడీ సమావేశం యీ నెల 11 వ తేదీన మద్రాసులో జరుగుతుంది. కృషికార్ లోక్‌పార్టీ నాయకులు రంగాగారు గూడ యీ సమావేశమునకు హాజరవుతారు. ప్రస్తుత రాజకీయ పరిస్థితులు-పార్టీ భవిష్యత్ కార్యక్రమం లాంటి పార్టీకి సంబంధించిన ముఖ్య విషయాలు చర్చకు వస్తాయి. ఆ దినమే పార్టీ కార్యవర్గ సమావేశం కూడా జరుగుతుంది. గనుక కార్యవర్గ సభ్యులు, జనరల్ బాడీ సభ్యులు, శాసన సభ్యులు తప్పక యీ సమావేశాలకు హాజరు కా గోర్తాను.

## సిద్ధేశ్వరం గండికోట ప్రాజెక్టుల ద్వారా రాయలసీమకు శాశ్వతరక్షణ

### అఖిలపక్షసభలో ప్రముఖుల ప్రసంగాలు

కడప, మార్చి 3: నందికొండతో పాటు ప్రథమ దశలోనే సిద్ధేశ్వరం-గండికోట ప్రాజెక్టును కూడా నిర్మించి పంచవర్ష ప్రణాళికలో చేర్చాలనీ, అప్పుడే రాయలసీమకు కరువు రాక్షసి నుంచి శాశ్వత రక్షణ కలుగుతుందని నిన్న యిక్కడ జరిగిన అఖిలపక్ష సభకు అధ్యక్షత వహించిన శ్రీ బి. రత్నసభాపతి గారు తమ అధ్యక్షోపన్యాసంలో అన్నారు. జిల్లాలోని కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు నాయకులు, శాసన సభ్యులు, యితర ప్రముఖులు శ్రీ రాజగోపాలరెడ్డి, వి. యస్. ఆచార్య సి. సుబ్బన్న గార్లు సభలో పాల్గొన్నారు. అధ్యక్షులు మాట్లాడుతూ పులిచింతల నిర్మాణం జరిగితే గండికోటకు కృష్ణ నీరు లభించే అవకాశంలేదని ఖోస్లా కమిటీ సూచించింది. కనుక పులిచింతల రెండవ కారు పంటనీటిని గండికోటకు మళ్ళించి అయినా రాయలసీమను రక్షించి ప్రజాస్వామిక వ్యవస్థను ఈ ప్రాంతంలో సుస్థిరం చేయాలని అన్నారు. ఆంధ్రదేశంలో నేడు అధికోత్పత్తి అనే దృక్పథంతో గాక వెనుకబడిన ప్రాంతాలకు సహాయం అనే దృష్టితో ప్రాజెక్టుల నిర్మాణం జరిగాలనీ, పులిచింతలకన్న సిద్ధేశ్వరం-గండికోట ముఖ్యమైనవనీ, ఆంధ్రరాష్ట్రం నిర్మాణం జరిగిన పిదప తిరిగి రామపాదసాగరు నిర్మాణానికి గోదావరి నీటిని మళ్ళించే ఏర్పాటు చేయడానికి ప్రయత్నించవచ్చునీ అధ్యక్షులన్నారు.

జిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ పుల్లారెడ్డి గారు మాట్లాడుతు గండికోటనుగురించి యిదివరలో బ్రిటిషు ప్రభుత్వంవారు పరిశీలించి తుంగభద్ర ప్రాజెక్టులో ఒక భాగంగా చేర్చారనీ, కాని ప్రస్తుతం సముద్వతి, ఎగువ పెన్నారు ప్రాజెక్టులు నిర్మిస్తున్నందువలన పెన్నానదిలో అయిదింట ఒకవంతు మాత్రమే గండికోటకు నీరులభిస్తుందనీ అన్నారు.

కృష్ణ పెన్నారు కట్టమనిగాని వద్దనిగాని రాయలసీమ ప్రజలు ఆందోళన చేయలేదనీ ఆదంతా సర్కారు ఆంధ్రులే లేవదీశారనీ అన్నారు.

శాసనసభ్యులు శ్రీ చల్లా సుబ్బరాయుడుగారు ప్రసంగిస్తూ సిద్ధేశ్వరం గండికోటవల్ల బనగానిపల్లెలో 1 లక్ష 37 వేల ఎకరాలు, కోవెలకుంట్ల తాలూకాలో 27 వేల ఎకరాలు, నందికొట్కూరు తాలూకాలో 19846 ఎకరాలు, నంద్యాల తాలూకాలో 1 లక్ష 18 వేల 400 ఎకరాలు శిరువెళ్ల తాలూకాలో 1 లక్ష 57 వేల ఎకరాలు, మొత్తం కర్నూలు జిల్లాలో 468,000 ఎకరాలు, సాగవుతుందనీ యింకా జమ్మలమడుగు ప్రొద్దుటూరు తాలూకాలలో సాగవుతుందనీ అన్నారు. పెన్నారు కుముద్వతి ప్రాజెక్టువల్ల 8 వేల ఎకరాలు సాగవగలిగినప్పటికీ ప్రభుత్వం దాన్ని నిర్మాణదశలో వుంచివిడిచిపెడదినవున్న దిగువభివానీ ప్రాజక్టుకు 1 లక్ష 50 వేల రూపాయలు వెచ్చించి 3 వేల ఎకరాలు మాత్రమే సాగులోకి తేవడానికి ప్రయత్నిస్తున్నారనీ అన్నారు. తుంగభద్ర నీటిని సిద్ధేశ్వరం ద్వారా ప్రవహింపజేసి తాడిపత్రి తాలూకా ద్వారా గండికోటకు ఎగువ భాగములో పెన్నతో కలుప వచ్చునీ, ఎలావున్నా సిద్ధేశ్వరం గండికోట ప్రాజెక్టు రాయలసీమకు జీవన్మరణ సమస్య అనీ, ప్రభుత్వం యీ అవసరం గుర్తించాలంటే యిలాటి సభలు చాలా జరపాలనీ అన్నారు.

శాసనసభ్యులు శ్రీ వై. ఆదినారాయణరెడ్డిగారు మాటలాడుతూ నందికొండవద్దని ఎవరూ అనడం లేదనీ, దానితోపాటే ప్రథమదశలోనే సిద్ధేశ్వరం-గండికోట ప్రాజెక్టుకూడ కట్టాలనీ, యిందుకు అవసరమైతే పులిచింతల రెండవ కారుపంట నీరు గండికోటకు మరలించడానికి ఉత్తరాంధ్రులు సిద్ధంగా వుండాలనీ అన్నారు.

పిదప శాసనసభ్యులు పి. వెంకటసుబ్బయ్య, శ్రీ కె. కోటిరెడ్డిగార్లు మాటలాడుతూ యీ ప్రాజక్టు కోసం రాయలసీమ ప్రజలు ఆందోళన చెయ్యకపోతే కేంద్రప్రభుత్వం ప్లానింగుకమిషను నివేదికను ఆమోదించిన పిదప యేమీ లాభం వుండదని అన్నారు. అధ్యక్షుని అంత్యోపన్యాసంతో 'గండికోట ప్రాజెక్టుకు జై' అనే నినాదముల మధ్య సభ ముగిసింది. (స్వ. వి)

మిగతా జిల్లాలకంటె చాలా పెద్దది. ఒక్క పెన్నానది మాత్రమేగాక, జిల్లాలో అనేక యేరులు, వాగులు ఉన్నవి. ఈనీటి వనరులపై సరియైన ప్రాజెక్టులు లేవందువల్ల చాలా తాలూకాలలో మాగాణిపంటలకు వీలుగాకున్నది. పొగాకు, వేరుశెనగలాంటి వాణిజ్య పంటలు పండించుటకు భూమి అనుకూలమైనది గాదు. అందువల్లనే ప్రజలు చాలా బీదరికంలో ఉన్నారు. నందికొండ సిద్ధేశ్వరం ప్రాజెక్టులను కట్టినట్లయితే జిల్లాలో చాలాభాగం ప్రయోజనం పొందుతుంది. ఆహారోత్పత్తి అనేకరెట్లు పెరుగుతుంది. రాష్ట్రప్రభుత్వ ఆదాయము, తద్వారా, జిల్లాబోర్డు ఆదాయం హెచ్చవుతుంది. అని స్వాగతపత్రంలో వివరించారు.

శ్రేయోరాజ్యం స్థాపించాలనే ఆశయంతో ప్రస్తుతం తలపెట్టబడిన స్కీములక్రింద జిల్లాబోర్డు వ్యయం విపరీతంగా పెరుగుతోంది. ఈజిల్లాబోర్డు పరిపాలనాధీన ప్రాంతంలో 753 మైళ్ల 3 ఫర్లాంగుల రోడ్లు ఉన్న, యుద్ధానంతర రోడ్ల అభివృద్ధి స్కీము క్రింద కొత్తగా 90 మైళ్లు రోడ్లువేయబడుతుంది. ఈరోడ్ల పోషణక్రింద, జిల్లాబోర్డువారు సాలీనా 4½ లక్షల రూ. లు ఖర్చుపెట్టవలసివస్తుంది. ఇదిగాక, జిల్లాబోర్డువారు 61 ఆస్పత్రులను, 617 ప్రాథమిక పాఠశాలలను, 34 సెకండరీ పాఠశాలలను, 23 విశ్రాంతిభవనాలను 24 సత్రములను, 2 ప్రసూతి ఆస్పత్రులను, నిర్వహిస్తున్నారు.

వీటి నిర్వహణకు సాలీనా 25 లక్షల రూ. లు ఖర్చవుతున్నది. జిల్లాబోర్డు ఆదాయాధారాలు బహు స్వల్పం. మార్కెట్లు, సంతలు, వగైరా లాభసాటి పనులేవీ జిల్లాబోర్డు క్రిందలేవు. ఇన్ని పద్దులక్రింద 1951-52 లో జిల్లా బోర్డుకు వచ్చిన ఆదాయం 3557210/- ఖర్చు 3939330/- సంవత్సరానికి 496602 రూ. లు లోటు తేలింది. మోటారుబస్సు సర్వీసులను జిల్లాబోర్డు నిర్వహించడానికి ప్రభుత్వం అనుమతి యివ్వక పోయినట్లయితే, జిల్లాబోర్డు అధ్వర్యాన ఉన్న సెకండరీస్కూళ్లకు ప్రత్యేక ఆర్థికసహాయం యివ్వకపోతే జిల్లాబోర్డు ఉద్యోగుల కరువుభత్యం క్రింద ప్రభుత్వం కొంత గ్రాంటు మంజూరు చేయకపోతే యీ లోటును భర్తీచేయడం కష్టం. ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొని, జిల్లాబోర్డు ఆర్థికంగా స్వయంశక్తిపై ఆధారపడ కలుగునట్లు చేయగలదని విశ్వసిస్తున్నాము." అని స్వాగతపత్రంలో పేర్కొన్నారు.

జిల్లాబోర్డు అధ్యక్షుల బాధ్యతలకు తగినట్లు, వారికి అధికారాలను పెంచాలని, ఉన్న అధికారాలను సక్రమంగా వినియోగించగల పదుపాయాలను కల్పించాలని కోరారు.

## నందికొండ సిద్ధేశ్వరం ప్రాజెక్టులు

### గవర్నరుకు నెల్లూరుజిల్లాబోర్డు విజ్ఞప్తి

నెల్లూరు, మార్చి 2: ఈజిల్లాబోర్డువారు, యివాళ, మద్రాసు గవర్నరు శ్రీప్రకాశ్ గారికి సమర్పించిన స్వాగతపత్రంలో నందికొండ సిద్ధేశ్వరం ప్రాజెక్టులను నిర్మించాలని అర్థించారు.

10 రెవెన్యూ తాలూకాలు, 8 వేల చదరపు మైళ్ల విస్తీర్ణం కలిగిన నెల్లూరుజిల్లా మద్రాసు రాష్ట్రంలో

## మద్రాసు వార్తలు

జార్జిటౌను పేట మింట్ స్ట్రీటు నెం 3/487 వ ఇంటిలో ఫిబ్రవరి 26 తేదీన సాన్ డెలివరీ సబ్ పోస్టాఫీసును ప్రారంభించారు. ఇక్కడ టెలిగ్రాములుతప్ప తతిమా పోస్టలు వ్యాపారం అంతా జరుగుతుంది.

* * *

తలిరెకైవద్ద ఫిబ్రవరి 22 న జనరల్ ట్రంక్ సిస్టమునకు కలిసిన టెలిఫోన్ కాల్ ఆఫీసును ఏర్పాటుచేశారు.

* * *

ఫిబ్రవరి 14 తో అంతమైన వారంలో రాష్ట్రంలో 1109 మందికి కలరా తగిలి 557 గురు చనిపోయారు. 227 మందికి మశూచి తగిలి 39 మంది చనిపోయారు. మదరాసునగరంలో కలరావల్ల 3 గ్గురు, మశూచివల్ల 2 రు చనిపోయారు. 10 మందికి కలరా 7 గురికి మశూచి తగిలింది.

* * *

సిటీ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు 25 తేదీన శ్రీ ఎ. రాఘవరెడ్డిగారి అధ్యక్షతను ప్రత్యేకముగ సమావేశమై 1953-54 సంవత్సరపు బడ్జెటు అంచనాలను ఆమోదించారు. తరువాత జరిగిన సమావేశంలో గవర్నమెంటు ఫారము హౌసింగ్ స్కీములో మరో 36 ఇళ్లను కమ్యూనిటీ సెంటరును నిర్మించాలని తీర్మానించారు.

* * *

## మంత్రుల కార్యక్రమం

మదరాసు, మార్చి 4: సహకార మంత్రి శ్రీ డి. సంజీవయ్య 7 తేదీ శనివారం రాత్రి పూరీ పాసింజరులో నిడుబ్రోలు వెళతారు. 8 తేదీన చెరుకుపల్లి చూచుకుని 9 తేదీన తిరిగి వస్తారు.

* * *

పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ నాదు రంగారెడ్డిగారు 7 తేదీన తాడిపత్రి వెళ్లి 8 తేదీన కలెక్టరు ఏర్పాటుచేసిన కార్యక్రమం ప్రకారం తాలూకాలో పర్యటించి 9 తేదీ ఉదయానికి తిరిగి వస్తారు.

## జీవన వ్యయసూచి సంఖ్య

మదరాసు, మార్చి 3: జనవరి 31 వ తేదీలో అంతమైన వారంలో మద్రాసునగరంలోని కార్మికవర్గాల జీవన వ్యయ సూచీ సంఖ్య 327. క్రితం వారం కంటె హెచ్చనూలేదు, తగ్గనూలేదు.

## అమృతసర్‌లో అకాలీ నాయకుని అరెస్టు

అమృతసరం, మార్చి 2: తారాసింగ్ అరెస్టుకు అసమ్మతి దెలపడానికి జలియన్ వాలాబాగ్ లో జరిగినసభలో కరపత్రాలు పంచిపెట్టాడనే నేరంపై పోలీసులు నేడు నగరఅకాలీదళ కార్యదర్శి అయిన సర్దార్ అవతన్ సింగ్‌ను అరెస్టు చేశారు. ఈయనతో సహా యింతవరకు 107 మంది అరెస్టయినారు.

## 'చలన చిత్రాలను సెన్సార్ చేసే బాధ్యతను నిర్మాతలకే ఇవ్వాలి'

### వీడ్కోలు సభలో కె. శ్రీనివాసన్‌గారి ప్రకటన

మద్రాసు, మార్చి 1.

కేంద్ర ఫిలిం సెన్సార్ బోర్డు తరఫున మద్రాసుప్రాంత అధికారిగా ఉంటున్న శ్రీ కె. శ్రీనివాసన్ గారు కలకత్తాకు బదిలీ అయ్యే సందర్భంలో మద్రాసులోని ఫిలిం ప్రొడ్యూసర్లు, స్టూడియోల యజమానులు వాహినీ స్టూడియోలో నిన్న సాయంత్రం వీడ్కోలుసభ ఏర్పాటు చేశారు. కన్నులపండువుగా విద్యుద్దీపాలు, తదితర అలంకారాలు ఈ సందర్భంలో అమర్చబడినై.

సభకు ఎస్. ఎస్. వాసన్ అధ్యక్షత వహించారు. బి. నాగిరెడ్డిగారు అతిథులను ఆహ్వానించారు. వాసన్ మాటలాడుతూ సెన్సార్ అధికారిగా శ్రీనివాసన్ గారు గురుతరమైన బాధ్యత నిర్వహించారన్నారు. ఇటు ప్రొడ్యూసర్ల ఛాక్ ప్రకటన స్వాతంత్ర్యానికి, అటు సెన్సార్ అధికారిగా ప్రభుత్వనియమ నిబంధనలకూ భంగంరాకుండా సమన్వయించుకు పోగలిగారనీ ఆయన అన్నారు. భారత రాజ్యాంగం ప్రతిపౌరునికీ ప్రసాదిస్తున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనే ఫిలిం నిర్మాణంలో ప్రొడ్యూసర్లకు కూడా లభింపజేసినట్లయితే ప్రొడ్యూసర్లు తమ బాధ్యతలను సవ్యంగా పరిశ్రమను నియమబద్ధంగా నిర్వహించ గలరనీ, తమ స్వాతంత్ర్యమును నాడు దుర్వినియోగపరచరనీ వాసన్ హామీ యిచ్చారు.

హెచ్. ఎమ్. రెడ్డిగారు వీడ్కోలు పత్రం చదివిన అనంతరం శ్రీ శ్రీనివాసన్ సమాధానమిస్తూ, తమ అధికార విధి నిర్వహణలో ప్రొడ్యూసర్లు ఇంతకాలమూ ఇచ్చిన సహకారానికి కృతజ్ఞత తెలిపారు.

చలనచిత్రాలను సెన్సార్ చేసే బాధ్యత చిత్రనిర్మాతలకే అప్పగించటం మంచిదని కూడా ఆయన ఉద్ఘాటించారు. సెన్సార్ షిప్ బాధ్యత స్వీకరించినప్పుడు ఫిలిం రంగంలోని నిర్మాతలలో, దర్శకులలో, రచయితలలో, నటీనటులలో సంఘక్షేమమే ప్రధానమని ఎంచగల పరివర్తన రావలసివుందనీ, ఈ పరివర్తన కలుగుతున్న సూచనలు కనిపిస్తున్నందుకు సంతోషిస్తున్నాననికూడా ఆయన అన్నారు.

ద. భా. ఫిలిం వాణిజ్య మండలి అధ్యక్షుడు శ్రీ ఎ. రామయ్యగారు సభికులకు ధన్యవాదం సమర్పించారు.

సభానంతరం కుమారి కమల ఛరత నాట్య ప్రదర్శనం ఇచ్చింది.

## కాకినాడ తాలూకాలో బియ్యం ధరల పెరుగుదల

### చౌకడిపోలు తెరవాలని విజ్ఞప్తి

కాకినాడ, మార్చి 2: కాకినాడ తాలూకాలో పటవల, తాళ్లరేవు, సుబ్బవరం, ఇంజరం, కోజులూరు, దుగ్గుదుర్రు మొదలైన గ్రామాలు పర్యటించి ఆహార పరిస్థితి చాలఘోరంగా వుందని శ్రీ సి. వి. కె. రావు, ఎం. ఎల్. ఎ. గారు ప్రకటిస్తున్నారు. బియ్యంధర పెరిగిపోతూందనీ, బీదప్రజలు కుంచం రు 3/- ల చొప్పున బియ్యం కొనుక్కోలేక పోతున్నారనీ, కాకినాడ నగరంలోకూడ ధరలు పెరిగి పోయాయనీ, ప్రభుత్వంవారు వెంటనే చౌక బియ్యండిపోలను ఏర్పరచి ప్రజలకు ఆహారధాన్యాలు సరసమైన ధరలకు దొరకుతాయని హామీయివ్వాలనీ ఆ ప్రకటనలో కోరారు. జోనలు పద్ధతి సక్రమంగా జరగటంలేదని విమర్శించారు. (స్వ. వి.)

## గ్రామపంచాయతీ బోర్డుల ఎన్నిక ఫలితాలు

### గుడ్లవల్లేరు

యీ గ్రామ పంచాయతీ బోర్డుకు అనుమల్లి వెంకటసుబ్బారావు గారు అత్యధికమైన మెజారిటీతో అధ్యక్షులుగా ఎన్నికైనారు.

### ముదనపల్లి

ఈ గ్రామ పంచాయతీబోర్డుకు ఈ దిగువవారు సభ్యులుగా ఎన్నికైనారు. శ్రీయుతులు డి. రంగస్వామినాయుడు గుండ్లూరి అబ్దుర్రహమాన్, జె. మునితప్పయ్యచెట్టి, మొగిలి రామస్వామిచెట్టి, వి. కనకయ్య, కలీలిసాహెబ్, జి. వెంకటస్వామి, ఎస్. అబ్దుల్ ఘని, బి. రామయ్యనాయుడు, జి. అమీర్ పీర్, జి. వి. చౌదరి, పి. హనుమంతు ఆర్. వెంకటరెడ్డి, ఆర్. సుబ్రమణ్య శాస్త్రి గారలు.

### భూపాలపట్నం

అధ్యక్షులు: మద్దిరెడ్డి సూర్యనారాయణగారు. సభ్యులు: సుమ్మిడిరెడ్డి వెంటయ్య, మేడి వెంకట్రాయుడు, మద్దిరెడ్డి వీర్రాజు, ముద్రగడ కృష్ణమూర్తి, పలివెల దోసయ్య, సంచికట్లసూరయ్య గారలు.

### నరేంద్రపురం

అధ్యక్షులు: త్సల్లా సుబ్రమణ్యం గారు, కోట మహాలక్ష్మి, అయ్యగారి రామమూర్తి పసుపులేటి అబద్ధం కుడుపూడి నరసింహమూర్తి, కొంబత్తుల వెంకయ్య, తరపట్ల సత్తెయ్య సభ్యులు.

### పోణంగి (ఏలూరు తా॥)

అధ్యక్షులు: కంచన సీతారామాంజనేయులు, సభ్యులు: పేరాబత్తుల శేషగిరిరావు, గుడివాడ కృష్ణ పెరుమాళ్లరావు, తర్లబోయిన భూపతి, గులపల్లి కృష్ణమూర్తి, పలిపే మారయ్య, కొంజర్ల ఏలియా గారలు.

### పొన్నపల్లి (రేపల్లె తా॥)

అధ్యక్షులు: గావా సుబ్బారెడ్డిగారు సభ్యులు: కిటి కోటిరెడ్డి, దుండి నాయుడు, దొందిబోయిన వెంకటేశ్వర్లరెడ్డి, అనుమోలు వెంకటేశ్వర్లు రెడ్డి పొన్నపల్లి యజ్ఞనారాయణశర్మ ద్రోంతుబోయిన రాయలరెడ్డి,

### సత్తెనపల్లి (నార్నిపాడు తా॥)

అధ్యక్షులు నలబోతు రామకృష్ణయ్యగారు సభ్యులు: మైనేని రామకోటయ్య, జర్దీకందనం, పొలూరి వెంకటేశ్వరరెడ్డి, కనుమూరిరామారావు పాలడుగు సూర్యనారాయణ షేకుఖాశిం అల్లిసాహెబ్ గారలు.

### చిగురుపాడు

అధ్యక్షులు: రాయపెంకటేశ్వర్లుగారు సభ్యులు గోవిందునరసింహం, వెంకా గురుమూర్తి, సాకె కొమ్ముకోటిరెడ్డి, బాసు పెద్దిరెడ్డి, చంద్రపాటి యాకబ్, గంగిరెడ్డి పాపిరెడ్డి, అంచుల రామయ్య గారలు.

### పోతివరం (కొత్తపేట తా॥)

అధ్యక్షులు షేకుశిలారుసాహెబ్, గారు సభ్యులు: నిడదవోలు గుర్రాజు మాలదానయ్య, పులవర్తి వెంకన్న ముంగండ సూరన్న, దొమ్మేటి చింతన్న ములగలేటి యిటికాలు గారలు.

### రామవరపుకోట

అధ్యక్షులు: కొండూరు సూర్యనారాయణరావుగారు. గొట్టుముక్కల నరసింహం, వానరాశివీరరాఘవులు, మూరం తిరుపతయ్య, మానికొండ కొంతయ్య, లక్కవేని రామేశ్వరరావు కశ్యప్రకాశం, వాకాధర్మయ్య, జాలిగం సుబ్బయ్య గారలు.

### కాకర్లమూడి (తాడేపల్లి గూడెం తా॥)

అధ్యక్షులు: పల్లజర్లరామారావు గారు సభ్యులు: తోటపల్లి కొండయ్య తోట పెదకొండయ్య, గొర్రెల తాతయ్య, నవుడు ఎర్రయ్య, మర్లపట్ల రామయ్య (రి) సుందరనీడి చినలక్ష్మయ్య గారలు.

### తాడేపల్లిగూడెం తా॥

మాధవరం: అధ్యక్షులు: ప్రత్తి బ్రహ్మన్న గారు సభ్యులు. తమ్మిశెట్టి కనకయ్య, ప్రత్తి లక్ష్మీనారాయణ, వట్టి రంగనాయకులు, కొంతేరుమళ్లి, పిడిక వీరయ్య, కొడమటిపాటి వెంకయ్య, విలూరు వీరాస్వామి గారలు.

### అమలాపురం తాలూకా

కొనలంక: అధ్యక్షుడు: మంపిణి నరసింహారావుగారు. సభ్యులు: ఇక్కపల్లి సత్యం, మానపల్లి అయ్యన్న, జక్కంపూడి ఆచార్యులు, శీలం వీరన్న, నక్కాగవిరాజు, పెొర్త వళ్లరాజు, బి. సూరన్న గారలు.

కోమునపల్లి: అధ్యక్షులు: కోలాపుట్రయ్య. సభ్యులు: రెడ్డి నారాయణమూర్తి, బూసి నారాయణమూర్తి, రాచకొండరామమూర్తి, మెట్లా వెంకట సోమయాజులు, బొంతు మాణిక్యం, సన్నబోయిన అర్జునుడు, కపిలి వీరాస్వామి గారలు.

నేవాపల్లి లంక: బొబ్బ పట్టాభిరామయ్య, కొనాయి వెంకన్న, సెట్టా చంద్రయ్య, జాస్తి వెంకన్న, చిరుమూరు సూర్యనారాయణమూర్తి, కడలి సత్యనారాయణమూర్తి మేకా పెద శ్రీరామమూర్తి, నక్కా వెంకటరెడ్డి గారలు.

### గ్రామ చింతలపూడి

అధ్యక్షుడు. రాయపురెడ్డి భాగయ్య గారు, సభ్యులు. పాయిసం సూర్యనారాయణ, రాయపురెడ్డి సత్యనారాయణమూర్తి చట్టుగుళ్లరావు. దెవరపల్లి మస్తాను, వానబోయిన సత్యనారాయణ, చట్టుగుళ్ల వెంకన్న గారలు.

### చెయ్యేరు

అధ్యక్షులు. దంతులూరి వెంకట కృష్ణరాజాగారు సభ్యులు. దున్నబోయిన నారాయణమూర్తి, బసవరాజు, పుటుకూరి నాగభూషణం, జగడం నరసింహమూర్తి, నామా సూర్యనారాయణమూర్తి, గెడ్డి అప్పన్న, జంపన వెంకటరాజు.

### మాగం

అధ్యక్షులు వేగి చినవీరరామరాజు గారు సభ్యులు వేటుకూరి చిన్న సుబ్బరాజు, పత్తిల పెంటయ్య, మిమ్మితి రామస్వామి, కొమ్మిరెడ్డి నారాయణమూర్తి, వేటుకూరి సత్యనారాయణరాజు, వేటుకూరి బంగార్రాజు, దువ్వబోయిన వెంకటరెడ్డిగారలు.

### చినగడవల్లి

అధ్యక్షులు అంకన్న నాగేశ్వరరావు సభ్యులు గుత్తుల వెంకటస్వామి, కాశి అర్జన్న, షేక్ మీరా మొహిద్దీన్ సాహెబ్, బసవవీరాస్వామి, భద్రపుల్లయ్య భద్రపాపయ్య గారలు.

### కాట్రేనికోండ

అధ్యక్షులు అంగనిస్వామి సభ్యులు భద్రపల్లి అచ్యుత రామరాజు, ఆనివిళ్ల కామేశ్వరరావు, కొంకి నరసింహులు, వితివాల నారాయణమూర్తి, మోరంపూడి మావుళ్లు, గుత్తుల అచ్చయ్య, సన్నబోయిన మహాలక్ష్మి, వెంట్రు సోమయ్య గారలు.

## ఎయిడెడ్ టీచర్ల గ్రాంట్లలో కోత

### డివిజనల్ ఇన్స్పెక్టరు వద్దకు రాయబారం

గుంటూరు, మార్చి 3: ఎయిడెడ్ టీచర్ల గ్రాంట్లలో కొంతమొత్తం కోతగా తగ్గించే పద్ధతి ప్రస్తుతం అమలులో లేదని కాకినాడ డివిజనల్ ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు ఫిబ్రవరి 28 తేదీన ఆంధ్ర రాష్ట్ర ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచర్ల మహాసభల కన్వీనరు కొత్తపల్లి సీతారామయ్యగారికి చెప్పారు.

ఈపద్ధతిని రద్దు చేస్తూ ప్రభుత్వం యిదివరకే ఉత్తర్వులిచ్చినా, కొందరు ఇన్స్పెక్టర్లు యింకా పాత పద్ధతిలో కొంతమంది వుపాధ్యాయుల గ్రాంట్లలో కొంత మొత్తం తగ్గించి చాలామంది వుపాధ్యాయులకు అన్యాయం చేస్తున్నారంటూ డివిజనల్ ఇన్స్పెక్టరుకు ఒక విజ్ఞాపన సమర్పించగా ఆయన అప్పుడక్కడున్న ఇన్స్పెక్టర్లతో మైఖికంగా చెప్పారు.

సీతారామయ్యగారు తమ విజ్ఞాపనలో తెలియజేసిన విషయాలన్నింటినీ డివిజనల్ ఇన్స్పెక్టర్ సావధానంగా విని ఈ విషయంలో 1952 సం॥ రాజకీయోపాధ్యాయులకు గ్రాంట్లు యిచ్చే విషయంలో కొంత మంది ఉపాధ్యాయులకు ఏమైనా అన్యాయాలు జరిగితే వాటన్నింటినీ సరిదిద్దుకోవలసిందిగా జిల్లా విద్యాశాఖాధికారులకు డివిజనల్ ఇన్స్పెక్టరు తెలియచేశారట. జరిమానాల పద్ధతిని కూడా క్రమంగా పరిశీలించి తగు సహాయం చేస్తామని డివిజనల్ ఇన్స్పెక్టరు సీతారామయ్యగారికి చెప్పినట్లు తెలుస్తున్నది.

# గోధుమ ధర తగ్గింపు

## మద్రాసు ప్రభుత్వవర్గాల అభిప్రాయం

మదరాసు, మార్చి 3: గోధుమల ధరను మణుగు 1కి రు 1 తగ్గించుటవలన ప్రస్తుతము గోధుమల వ్యాపారంలో రాష్ట్రప్రభుత్వమునకు వస్తున్న నష్టము కొంత పూడుతుంది.

ప్రస్తుతము మదరాసు ప్రభుత్వము గోధుమలను మణుగ రు 14½ లకు అమ్ముతోంది. అందువలన రాష్ట్రప్రభుత్వము రు 4½ లు నష్టము భరిస్తోంది. ఇప్పుడు ఇండియా ప్రభుత్వం గోధుమల ధరను తగ్గించుటవలన ఈ నష్టం కొంత తగ్గుతుంది. ఇదేగాక కేంద్రంనుండి ఏదో రూపంలో కొంత ధనసహాయం లభించవచ్చని రాష్ట్రప్రభుత్వంవారు ఆశిస్తున్నారు.

ధర తగ్గించినా ఈ ప్రాంతంలో గోధుమల వాడకం ఎక్కువ కానందున కొన్ని గోధుమలను పిండిగను, రవ్వగను అటుకులుగను తయారుచేసి అమ్ముటకు ప్రభుత్వం యత్నంచేస్తోంది. పిండిని రొట్టెదుకాణదార్లు తీసుకుంటున్నారు కాని అటుకులుగ తయారు చేయించిన 25 టన్నుల గోధుమలు వృధాఅయి పశువులకు మేపవలసిందేగాని ఎందుకు పనికిరాదని తేలిందట.

గోధుమలను బియ్యంవలె వండుటకు [illegible] వండినను గోధుమలలోని [illegible] నశించగలదనీ అందువలన కాచుకొని మంచిదని ప్రవీణులు చెప్పినట్లు తెలుస్తున్నది.

# కరాచీలో ధరల పెరుగుదల

కరాచీ, మార్చి 2: దిగుమతులను తగ్గిస్తూ పాకిస్థాన్ ప్రభుత్వం క్రిందటి ఆదివారం క్రొత్త దిగుమతి విధానం ప్రకటించినప్పటికి ఇక్కడి దుకాణాలలో అనేక వస్తువులు మాయమైనవి. మిగతా వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి పోయినవి. (పి. టి. ఐ.)

# మద్రాసుకు ఆఫ్రికన్ నాయకుని రాక

## ఒగింగా ఒడింగా మూడు వారాల పర్యటన

మదరాసు, మార్చి 4: కెన్యా కాలనీ కిసుముకు చెందిన ఆఫ్రికన్ నాయకుడు శ్రీ ఒగింగా ఒడింగా నిన్న రాత్రి త్రివేంద్రంనుండి ఇక్కడికి వచ్చారు. వీరు భారతదేశములో మూడు వారాలపాటు ముఖ్యనగరాలను చూస్తారు. మార్చి 6 తేదీ కలకత్తాకు బయలుదేరి వెడతారు.

శ్రీ ఒగింగా ఒడింగా కెన్యా ఆఫ్రికన్ ...

# మైసూరులో సత్యాగ్రహం

## ప్రజా పోరాటంగా పరివర్తన

...

75 మంది సాముహిత ఉపవాసం

...

# కాదేపల్లిగూడెం మార్కెట్ ధరలు

...


ఆంధ్ర విశ్వకళా పరిషదనుబంధ కళాశాలల పోటీలలో గెలుపొందిన గుంటూరు హిందూ కాలేజి విద్యార్థులు ప్రిన్సిపల్ పి. కె. నాయుడు (మధ్య కూర్చున్నవారు), పి. ఎస్. నాయుడు (కుడినుండి 3.వవారు), ముష్టాక్ అల్లీ (ఎడమనుండి 3.వ వారు) గార్లతో తీయించుకొన్న ఫోటో.

# ఆయుధచట్టం క్రింద కమ్యూనిస్టులపై కేసు

హైదరాబాదు, మార్చి 3: ఆయుధ చట్టంక్రింద నలుగురు కమ్యూనిస్టులూ మరి యిద్దరు ఇతరులమీద స్పెషల్ మేజస్ట్రేటు సయ్యద్ ఫిరాసత్ హుసేన్ గారి యెదుట చార్జిషీటు దాఖలు చేయబడింది. తమవద్ద ఆయుధాలనూ, మందుగుండు సామగ్రినీ పెద్దమొత్తాలు పెట్టుకొని యుండడమేకాక వాటిని సాయుధ పోరాట సమయంలో తెలంగాణా కమ్యూనిస్టులకు సప్లయి చేస్తూ వచ్చిన నేరం కమ్యూనిస్టు ప్రముఖులైన కె. యల్. మహేంద్ర అనే అతనిపైనా, ఆయన భార్యపైనా ఆరోపింపబడింది. అతని యింట్లో పోలీసులకు కొన్ని రైఫిల్సూ, ఆటోమాటిక్ పిస్తోళ్లూ, రివాల్వర్లూ, చాలా మందుగుండు సామగ్రి, ...

# ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘం

విజయవాడ, మార్చి 3: ...

# రాజమండ్రి మహిళాహిందీ విశారద విద్యాలయము

...

1951-52 అంతర్విశ్వ విద్యాలయ హాకీ టూర్నమెంటులో ఆంధ్ర విశ్వకళా పరిషత్ తరపున పాల్గొన్న గుంటూరు హిందూ కాలేజి విద్యార్థులు ఎస్. వెంకటేశ్వరరావు, జి. ఎం. నరసింహారావు.

1952-53 అంతర్విశ్వ విద్యాలయ ఫుట్‌బాల్ టూర్నమెంటులో ఆంధ్ర విశ్వకళా పరిషత్ తరపున పాల్గొన్న గుంటూరు హిందూకాలేజి విద్యార్థులు టి. రాముడు, ఎల్. రామారావు (కాప్టెన్)

# ఆంధ్రప్రదేశ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

## 12 న చర్చించనున్న కార్యక్రమం

విజయవాడ, మార్చి 4: ఈ నెల 12 వ తేదీన విజయవాడ ఆంధ్రరత్న భవనంలో జరుగనున్న ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు నూత్న కార్యవర్గ ప్రథమ సమావేశంలో ఈదిగువ విషయాలు చర్చింపబడును.

(ఆంధ్రకాంగ్రెసు కార్యవర్గ సమావేశం విజయవాడలో జరుగుతుందనే వార్తను ఆంధ్రపత్రిక నిన్ననే ప్రకటించింది.)

ఎజెండా

జిల్లా కాంగ్రెసుసంఘసభ్యత్వనిరోధకవర్గ జాబితాలను ఆమోదించడం;

జిల్లా కాంగ్రెసుసంఘ సభ్యులఎన్నికల కార్యక్రమ నిర్ణయము చేయడం;

గోల్కొండ కాంగ్రెసు మహాసభ తీర్మానాలను అమలుపరిచే విషయాన్ని పరిశీలించడం;

అనుబంధ సంస్థల నిర్మాణ సమస్య పరిశీలన.

కాంగ్రెసు సేవాదళ పునర్నిర్మాణమును గురించి "కాంగ్రెస్" పత్రిక నిబంధనల సమస్య.

జనరల్ ఎన్నికల నిర్వహణలో కలిగిన అనుభవం దృష్ట్యా, సలహాలను అడుగుతూ అఖిలభారత కాంగ్రెసువారు పంపిన సర్క్యులర్ పై చర్చ.

...

## "గ్రామాభ్యుదయానికి కృషి చెయ్యండి"

### గ్రామసేవకులకు రాజాజీ సలహా

గాంధీగ్రాం (మధుర) మార్చి 3: కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రణాళికలననుసరించి గాంధీగ్రాంలో గ్రామ సేవకుల శిక్షణ నిమిత్తం నెలకొల్పబడిన 8 భవనాలకు ముఖ్య మంత్రి రాజాజీ యీవేళ ప్రారంభోత్సవం చేశారు.

ఈ 8 భవనాలలో ఒక సుందరమైన హాలులో శ్రీ రాజగోపాలాచారిగారొక దీపం వెలిగించారు. ఆ సందర్భంలో ఆయన యిలా ప్రసంగించారు:

"ఇందాక నేను ఆదీపం వెలిగిస్తూండగా ఒకసారి అది ఆరిపోయింది. గాలి వీస్తున్నది కదా అందు చేత ఆరిపోయింది. మళ్ళీ ప్రయత్నించి దీపం వెలిగించాను. గ్రామంలో సేవ చెయ్యడానికి వెళ్లనున్న మీకుకూడా ఈఅనుభవం కలుగవచ్చు. మీరు వెలిగించే దీపాలను ఆర్పటానికి కూడా దేశంలో అనేక గాలులు ప్రయత్నిస్తవి. కాని మీరు మాత్రం నిరుత్సాహపడకుండా నామాదిరిగానే ప్రయత్నించాలి. అలా చేసినట్లయితే దైవం మెచ్చుతుంది. మన గ్రామాలుకూడా పూర్వ వైభవాన్ని తిరిగి పొందగలవు."

## వడివట్టి గ్రామానికి రాజాజీ రాక

...

క్రీడారంగం:

# మద్రాసులో ఆసియా ఛాంపియన్ల టేబుల్ టెన్నిస్ ప్రదర్శనం

## ఆటలో సీనూచూ ప్రత్యేకపద్ధతి

మద్రాసు, మార్చి 2: ఈ వేళ సాయంత్రం మద్రాసు సెంట్ మేరీస్ హాల్లో ఎంతో చక్కటి టేబుల్ టెన్నిస్ ఆట ప్రదర్శింపబడ్డది. ఆసియా ఛాంపియన్ సీనూచూ, హాంకాంగ్ ఛాంపియన్ చుంగ్ చిన్‌సింగ్ భారత ఛాంపియన్ కల్యాన్ ప్రార్ జయంత్, మద్రాసు ఛాంపియన్ టి. తిరుసంగడం, మరికొందరు స్థానిక ఆటగాళ్లు పెడిక్కడ ఎగ్జిబిషన్ ఆటలు ఆడారు.

నేటి పోటీలలో జయంత్, తిరుసంగడాలు ప్రత్యేక నైపుణ్యాన్ని చూపించలేదు. స్థానిక ప్రతినిధుల్లో ఎన్. సి. రాఘవన్, ఎన్. రాముడులు మంచి నేర్పును చూపించారు. అయితే వీరందరిఆట ఒకఎత్తుగానూ, సీనూచూ ఆట ఒకఎత్తుగానూ కనిపించింది. ఆటలో ఒక్క పొరపాటనేది కూడా లేకుండా, బంతిని పూర్తిగా తన అదుపుకింద ఉంచుకుని, మహాబలమైన దెబ్బలతో ప్రతివాళ్ళనూ సీనూచూ ముప్పతిప్పలు పెట్టాడు. అయితే చుంగ్ చిన్‌సింగ్ మాత్రం విపరీతమయిన చలాకీతో, లేడిపిల్ల మోస్తరు దూకుతూ, సీనూచూధాటికి చాలావరకు తట్టుకోగలిగాడు.

## సీనూచూ ఆటలో ప్రత్యేకత

సీనూచూ ఆటను చూస్తే అన్నివిధాలా ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. అటూ ఇటూ కదలటానికి అడుగు వేయటంలో అతడు ఒక్క పొరబాటు కూడా చేయడు. మనిషి ఎక్కడున్నా, ...

ఈ దిగువ ఫలితాలు వచ్చాయి. వి. రాజగోపాలన్ టి. ఎస్. నారాయణన్‌తో సమంఅయారు. ఎస్. కృష్ణన్ ఎస్. కె. రంగనాథన్‌నీ, శ్యామణి ఆర్. మహాజన్‌రావ్‌నీ, టి. ఎస్. సూరి శివలింగాస్నీ, టి. ఆర్. సెల్వరాజ్, పి. సత్యనారాయణను ఓడించారు.

పి. ఎస్. వైద్యనాథన్ గోవిందశెట్టితో, సి. మోహన్‌రాం టి. ఎస్. సూరితో సమమయారు. అబ్దుల్ హమీద్‌పై ఎస్. కృష్ణన్, హావాగానిపై ఎస్. కె. రంగనాథన్, జె. బి. కృష్ణమూర్తిపై టి. సుబ్రహ్మణ్యచెట్టి, బ్రహ్మానందరావుపై ఎన్. ఎస్. రాఘవన్, ఎస్. కె. అనంతరామన్‌పై వి. ఎస్. రాజగోపాలన్ వాకోవర్లు పొందారు.

## భీమవరం హైస్కూలు ఆటల పోటీలు

భీమవరం, మార్చి 2: స్థానిక శ్రీ జాపూడి గంగయ్య మెమోరియల్ హైస్కూలు వార్షిక ఆటల పోటీలలో గెలిచినవారికి నిన్న బహుమతులు పంచిపెట్టబడినవి. రాజా జాపూడి కేశవరావు గారు వాటిని పంచిపెట్టారు. ఆయా పోటీలలో ఈ దిగువవారు గెలుపొందారు:

సీనియర్స్

100 మీ. - 1. వి. శ్రీరామమూర్తి, 2. ఎం. సూర్యనారాయణ. 200 మీ. 1. వి. శ్రీరామమూర్తి, 2. ఎం. సూర్యనారాయణ ½ మైలు- 1. ఎం. సూర్యనారాయణ, 2. వి. శ్రీరామమూర్తి. ...

## మద్రాస్ చదరంగం

...

## రేణిగుంట హైస్కూలు ఆటల పోటీలు

...

## భద్రాచలం బాడ్మింటన్

...

## కంథం హైస్కూలు ఆటల పోటీలు

...

## రేడియో

శుక్రవారం, మార్చి 6 వ తేదీ

...

1-50 మద్రాసు (ఏ) వలె 1-50 హిందీలో వా. 1-50 తెలుగున వా. 2-0 మద్రాసు (బి) వలె 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు.

... సముపార్జనవల్ల కలిగే ఆనందం ... శాస్త్రం (ఆంగ్ల ప్రసంగం); 8-30 నిరుకోరిన పాటలు (రి); 9-0 ఆంగ్లమున వా॥ 9-15 'ఛాయ' (నాటిక) రచన విల్హాచి సుబ్రహ్మణ్యం;

## గంటల పంచాంగం

నందన సం॥ ఫాల్గుణ బ॥ చవితి

1953 సం॥ మార్చి 5 గురువారం

తి॥ చవితి ప 9-32 స్వా 24-0 వర్జ్యం ప 10-48 ల 12-32 క.

బ॥ పంచమి మార్చి 6 శుక్రవారం

తి॥ పంచమి ప 10-57 స్వా ఉ 6-45 వర్జ్యం క 12-48 ల 2-25 క.

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర
యప్రియమగు తన మనంబున కగు నా
పొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథములకు నెల్లన్ - (మహాభారతము)

నందన సం॥ ఫాల్గుణ బ॥ చవితి

గురువారం

## జమ్మూ ఆందోళన

కాశ్మీరు వ్యవహారాలనిర్వహణ మొదట్నుంచీ కూడా సవ్యంగా నిర్వర్తింపబడ లేదు. తన సంస్థాన భవిష్యత్తును గురించి సర్ హరిసింగ్ సకాలంలో ఒక నిర్ణయానికి రాలేక పోయినారు 1947 ఆగస్టు 15 కు పూర్వమే సర్ హరిసింగ్ భారత అధినివేశంతో చేరడమో, పాకిస్తాన్ అధినివేశంతో చేరడమో తేల్చుకొని వుంటే సంస్థాన చరిత్ర, భారత దేశచరిత్ర మరొకవిధంగా వుండేది. పరిస్థితులు చెయ్యిదాటి పోయిన తర్వాత, ప్రమాదం ముంచుకువచ్చిన తర్వాత సంస్థానాధీశ్వరుడు భారత ప్రభుత్వ సహాయాన్ని కోరాడు. 1947 ఆగస్టు 15 కు పూర్వం సర్ హరిసింగ్ ఏస్థితిలో, ఏ సందిగ్ధావస్థలో వున్నాడో 1947 అక్టోబరులో భారతప్రభుత్వం అదేస్థితిలోవుంది. కాశ్మీరు పాకిస్తాన్ వశం కావడం ప్రమాదకరమని భారతప్రభుత్వానికి తెలుసు. ద్విజాతి సిద్ధాంతాన్ని భారతదేశం అంగీకరించకపోయినా, కాశ్మీరు జనాభా దాదాపు నూటికి తొంభైమంది ముస్లింలన్న యథార్థ విషయాన్ని, పాకిస్తాన్ ముస్లిం రాజ్యంగానే అవతరించిందన్న సత్యాన్ని గుర్తించకుండా ఉండలేమని కూడా మన నాయకులకు తెలుసు. అయితే విటన్నిటినీ సమన్వయపర్చుకు రావడం ఎలాగో తెలియలేదు.

పాకిస్తాన్ దురాక్రమణ నుండి సంస్థానాన్ని రక్షించడం ముందుజరగవలసిన పనిగా భారతప్రభుత్వం భావించి ఆ ప్రకారం కాశ్మీరుకు సైన్యాలను పంపించింది ఆ పని పూర్తిగాక ముందే భారతప్రభుత్వం పాకిస్తాన్ దురాక్రమణపై ఐక్య రాజ్యసమితికిఫిర్యాదుచేసింది. అప్పట్నుంచీ కాశ్మీరు వ్యవహారం ఎవరికీ తృప్తికరంగా సాగడం లేదు కాశ్మీరు సమస్యను ఐక్యరాజ్య సమితి పరిష్కరించలేదని స్పష్టమైంది అయినా భారతప్రభుత్వం సమితి నిర్ణయాన్నే నిరీక్షిస్తూ వున్నది

ఆట్టి నిరీక్షణ నిరుపయోగమని ముందుగా గ్రహించింది కాశ్మీరుప్రధాని షేక్ అబ్దుల్లా. వీరికి ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ యందు తన్న భారతదేశమందు అంతగా విశ్వాసం లేదని ఏడాది క్రితం జమ్మూరాష్ట్రంలో చేసిన ఉపన్యాసం స్పష్టం చేసింది. అప్పట్నుంచీ జమ్మూ ప్రజలకు కాశ్మీరుముఖ్యమంత్రి ప్రాగ్రహం, అంతిమ లక్ష్యం గురించి అనుమానాలు వుంటూ వచ్చినవి. ఇటీవల భారతీయ పతాకం విషయంలోనూ, భారతీయ రాజ్యాంగం విషయంలోనూ, సంస్థాన అధిపతి విషయంలోనూ కాశ్మీరుప్రభుత్వం అనుసరిస్తున్న విధానం జమ్మూప్రజల అనుమానాలను దృఢపరిచింది. తత్ఫలితమే ప్రస్తుతం జమ్మూరాష్ట్రంలో జరుగుతున్న ఆందోళన.

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఈ పూర్వ చరిత్రను వదిలివేసి జమ్మూ ఆందోళనను విడిగా విచారించడంవల్లనే వారికి ఒక విద్రోహ దర్యగా కన్పిస్తున్నది. డాక్టర్ ముఖర్జీతో ప్రధానమంత్రి జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను పరిశీలిస్తే పండిట్ నెహ్రూ జమ్మూ ఆందోళనకుగల మూలకారణాలను తెలుసుకొనడానికి ప్రయత్నించ లేదని స్పష్టమౌతుంది. అలాగే డాక్టర్ ముఖర్జీ కూడా అసలు సమస్యకుగాక, జమ్మూ ప్రజాపరిషత్తుకు ప్రాధాన్యం ఇచ్చినట్లు స్పష్టమౌతుంది.

ఏమైనా ఈ సమస్య శాంతియుతంగానే పరిష్కారం కావాలి. అందుకు నెహ్రూ, అబ్దుల్లా, ముఖర్జీ ప్రభృతుల వైఖరి మారాలి. శీఘ్రంగా, శాంతియుతంగా ఈ సమస్య పరిష్కారం కాకపోతే అసలు కాశ్మీరు సమస్యే మరింత క్లిష్టమై, వ్యవహారం పూర్తిగా విషమించగలదు.

## కేంద్ర అబ్కారీ సుంకాల పంపిణీ

### బిల్లుకు ప్రజాసభ ఆమోదం

న్యూఢిల్లీ మార్చి 3: ప్రజాసభ నేడు కేంద్ర అబ్కారీ సుంకాల (పంపిణీ) బిల్లును ఆమోదించింది, దీని ననుసరించి కేంద్రప్రభుత్వానికి కొన్ని సుంకాల ద్వారా వచ్చే ఆదాయంలో కొంత ఆర్థిక కమీషను సిఫార్సు ప్రకారం, రాష్ట్రాలకు పంచి పెట్టడమవుతుంది.

ఈబిల్లు పై చర్చలో పాల్గొన్న ప్రతిసభ్యుడూ కూడా కమీషను సిఫార్సులు తన రాష్ట్రానికి అన్యాయం చేశాయనే అన్నాడు. బి. దాస్ మాత్రం కమీషన్ను ప్రశంసించి, దానిని రద్దు చేసినందుకు రాష్ట్రపతిని విమర్శించారు. ఆర్థిక మంత్రి చింతామణి దేశ ముఖ్ చర్చకు సమాధానమిస్తూ ఉన్న పరిస్థితులలో సాధ్యమైనంత సమంజసంగానే కమీషన్ ఈనిర్ణయం చేసిందనీ, ఆనిర్ణయాన్ని ప్రభుత్వం 'అ, ఉ' అనకుండా అంగీకరించిందనీ ఈచీత్యే ప్రస్తుత ఆదాయాన్ని చూపుట 17. 5 కోట్ల రూపాయలు రాష్ట్రాలకు పంచవలసి వస్తుందనీ అన్నారు.

దీనికి ముందు సభ రైల్వే అప్రోప్రియేషన్ బిల్లును అకౌంటుకు చెందిన మరి రెండుగ్రాంట్ల బిల్లులనూ ఆమోదించింది. ఇందులో సప్లిమెంటరీ డిమాండ్ల బిల్లు సందర్భంలో ప్రతికూల పక్షస్థులు 5 కోత తీర్మానాలు ప్రతిపాదించారు. రైల్వేల శతవార్షికోత్సవ సందర్భంలో ఎగ్జిబిషనుకు రూ 10,62,000/- ఖర్చుపెట్టడం దండగ అని ఒకరన్నారు. రైల్వేల అభివృద్ధికి కారకులు ప్రస్తుత ప్రభుత్వము పూర్వప్రభుత్వము కూడా కాదని, కార్మికులేననీ ఆనందన్ నంబియార్ అన్నారు, ఉత్సవ సందర్భంలో రైల్వేవర్కర్లందరికీ ఒక నెలజీతం బోనస్ గా ఇవ్వాలని టి. బి. విఠల్ (హైదరాబాదు) అన్నారు. రైల్వేల డిప్యూటీ మంత్రి సమాధానమిస్తూ ఎగ్జిబిషనుకు అయ్యే ఖర్చులో చాలాభాగం తిరిగివచ్చేస్తుందన్నారు.

## "కాయకష్టం చేయడం నేర్చుకోండి"

### మధుర విద్యార్థులసభలో రాజాజీ ఉద్బోధ

మధుర, మార్చి 3: మధుర కాలేజీలో యీ పేళ ఉదయం ప్రసంగించిన సందర్భంలో రాష్ట్రముఖ్యమంత్రి రాజాజీ విద్యార్థులు కాయకష్టం చేయడం నేర్చుకోవాలని పురోద్బోధించారు. ఈసందర్భంలో ఆయన ఇంకా ఇలా అన్నారు.

"ఉపయోగాలు నేర్చుకోవలసిందే గాని నేర్చుకున్న ఆవిద్యలను కొంతకాలంపాటు అవతల పెట్టి నిరుద్యోగులతోపాటు మీరుకూడా కొంతకాలం పనిచేయ్యాలి. ఇదే నాకు నేనుపదేశించే మంత్రం. మామంత్రం మీరు పాటిస్తే భారతదేశం సర్వదంగా సర్వసంపన్నం కాగలదు. లేకపోయినట్లయితే దారిద్ర్యంతోనే విషవలయం పుష్పణే అని మనలను వేధిస్తుంది. అధ్యయనీయ ప్రణాళికలకు కావలసిన పెట్టుబడులు మనవద్దను లేవు. కనుకముందు లాలోచించకుండా విపరీతంగా అప్పుచెయ్యడం మంచిది కాదు. ఇతరుల దయాధీనమైన నాశనం చవిచూడం చేసి చెదం లేదు. కనుక మనం కష్టించి పనిచెయ్యడమే కర్తవ్యము."

## అది, ఇది, అన్నీ

కృష్ణా రెగ్యులేటరు నిర్మాణంగురించి చెప్పేది ఏమీ లేదు; అన్నారు వారు రంగారెడ్డిగారు.

చేసేది ఏమీ లేనప్పుడు చెప్పేది మాత్రం వినుకుంటుంది- చేసేదేమీ లేదని చెప్పడం మంచిది.

కృష్ణా రెగ్యులేటరు విషయంలో చేసేది ఏమీలేదని అందరికీ కన్పిస్తున్నప్పుడు, చేసేదేమీ లేదని చెప్పవలసిన అవసరం ఏమున్నది?

రాష్ట్రం ఏర్పడబోతున్నది కనుక పనులన్నీ ఆగిపోయినవని మంత్రులు చెప్తూనే వున్నారుగదా!

కొందరు, కొన్ని సందర్భాల్లో, చేయ కలిగింది ఏమీ లేదని తెలిసినా, చెప్పడంమాత్రం చాలా చెప్తు వుంటారు.

మరి కొందరు చేసేది ఏమీ లేనప్పుడు, అది తెలియకుండా వుండాలని ఏమేమో చెప్తారు.

ఇవన్నీ నిరర్థకమనివారు రంగారెడ్డిగారు గ్రహించినారు.

చేసేదేమీ లేనప్పుడు చెప్పేది ఏమీ వుండదు. చేసేది వున్నప్పుడు, చేయడమేగాని చెప్పడం అనవసరం!

* * *

ఇంతవరకూ మన నాయకులు రాష్ట్రం తీసుకురావడానికి ఢిల్లీ వెళ్తూ వచ్చారు.

ఎవరు వెళ్ళినా, ఎవరు వెళ్ళకపోయినా రాష్ట్రం ఎలాగూ వస్తుంది. కనుక ఇప్పుడు రాష్ట్రంకోసరం ఢిల్లీ యాత్రలు సాగింప నవసరం లేదు.

అయినా కొందరు నాయకులు ఉగాదినాటికి రాష్ట్రం తీసుకువద్దామనే ఉత్సాహంతో ఢిల్లీ వెళ్లారు. తిరిగి వచ్చారు!

తరువాత మన స్థానికస్వపరిపాలనా మంత్రి శ్రీశంకరరెడ్డిగారు ఢిల్లీవెళ్లారు.

రాష్ట్రం తీసుకురావడానికే వీరు ఢిల్లీ వెళ్లలేదు. నాయకుల ఐకమత్యాన్ని సాధించుకురావడానికే నాయకంటి శంకరరెడ్డిగారు రాజధానికి వెళ్లారు.

రాష్ట్రం వచ్చేలోపుగ ఈ ఐకమత్యాన్ని సాధించుకురావాలి.

* * *

మనకు రాష్ట్రం ఎలాగూ మూడు నాలుగు మాసాల్లో వచ్చేస్తుంది. రాష్ట్రంవస్తే ఐకమత్యం దానంతట అదే వస్తుందని కొందరి నమ్మకం.

ఇప్పట్నుంచీ అందుకు ప్రయత్నం చేయడం వృథాశ్రమే అవుతుంది - ఐకమత్యం దానంతట అదే రాగలపతుంలో.

నాయకులంతా ఏకమై పోవడం సాధ్యంకాకపోవచ్చు; కాని వారిలో ఐకమత్యం ఏర్పడవచ్చు. ప్రకాశంపంతులుగారు ఢిల్లీలో జరిపిన సప్రతింపుల ఫలితంగా.

* * *

ఎటొచ్చీ మన తాత్కాలిక రాజధాని వ్యవహారమే ఇంకా చిక్కుగా వుంది!

తమిళనాడు రాజధాని మధుర అని తేలిపోయింది. మద్రాసు తమిళనాడులో వున్నా మధుర, తమిళ సంస్కృతికి రాజధాని రాష్ట్ర రాజధాని కాగలదన్నారు రాజాజీ.

పదేండ్ల క్రిందట మద్రాసు గవర్నరుపలహాదారులలో ఒకడైన స్ట్రాడీ చెప్పిందీ ఇదే.

"తమిళనాడుకు మధుర రాజధాని; ఆంధ్రకు విజయవాడ రాజధాని. మద్రాసు, పరిసర ప్రాంత (ప్రాంతాలతో ఏర్పడే రాష్ట్రానికి మదరాసు రాజధాని."

మధుర రాజధానిగా తమిళరాష్ట్రం ముందు ఏర్పడితే, మన రాజధాని సమస్యేగాక, మద్రాసు సమస్యకూడా సులభంగా పరిష్కారమయ్యే అవకాశం వున్నట్లు కన్పిస్తుంది!

* * *

అయితే మదరాసును ముందు ఆంధ్రులు వదిలిపెడితేగాని, తర్వాత అరవలు వదిలిపెట్టరు.

బ్యాటయంకూడా అంతే మరి. మదరాసుకు ముందు వచ్చింది ఆంధ్రులు వార్ని చూచి వచ్చింది, అరవలు. కొబట్టి ముందు ఆంధ్రులు వదిలిపెడితే తర్వాత వార్ని చూచి అరవలూ వదిలివేస్తారు.

ఇదంతా ఇలా జరుగుతుందనే, మదరాసును వదులుకుంటున్న ఆంధ్ర నాయకులు మదరాసును ప్రత్యేక రాష్ట్రంగా చేసి ఆ పట్టణకీర్తి ప్రతిష్ఠలను నిలబెట్టమని కోరుతున్నారు.

* * *

రావణాసురుడు, సీతను ఎత్తుకుపోయినట్లే, ఆంధ్రులు మదరాసును ఎత్తుకుపోవడానికి చూస్తున్నారని రాజగోపాలాచారిగారు మళ్లీ అంటున్నారు.

లంకాదహనం అంతపని అయినా చేసి రాజాజీ మదరాసును మళ్లా పట్టుకుపస్తారని తమిళప్రజలు ధైర్యంగా వుండవచ్చు!

కాని మదరాసును ఎత్తుకుపోవడం ఎలా సాధ్యమో వీరు విచారించడం లేదు.

ఎద్దు ఈనిందంటే గాడ్లో కట్టెయ్యమన్నట్లే వుంది ఈ వ్యవహారం అంతాను!

## 'హోలీ' సంరంభాలు

1953-54 సెంట్రల్ బడ్జెటు ప్రతిపాదనలపట్ల, క్రోధమోదాల సంకుల వాతావరణంగా వుంది. (నేషనల్ హెరాల్డ్ సౌజన్యం)

# పంచవర్షప్రణాళిక జయప్రదంకావాలని పండిట్ నెహ్రూ పట్టుదల

## ప్రజాసోషలిస్టు నాయకులతో ప్రధానమంత్రి ఉత్తర ప్రత్యుత్తరాలు

### రాష్ట్రాల్లోనూ, అవసరమైతే కేంద్రంలో మిశ్రమ మంత్రివర్గ స్థాపన?

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, మార్చి 3: పంచవర్ష ప్రణాళికను సక్రమంగా, సంపూర్ణంగా అమలు జరపటంకోసం ప్రధానమంత్రి నెహ్రూ గత మూడు నాలుగు నెలల ఈ మధ్య అనేక కాంగ్రెసేతర నాయకులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. దేశాభివృద్ధికోసం వ్యక్తిగతమైన, రాజకీయమైన అనేక భేదాభిప్రాయాలను తగ్గించుకొని, ఒకరిని ఒకరు సాధ్యమైనంత వరకు సుహృద్భావంతో అర్థం చేసుకొని, ప్రణాళికను అమలు చేయటానికి ప్రభుత్వానికి చేయూత ఇవ్వాలని నెహ్రూ ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలో వ్రాశారు.

ప్రణాళికను అమలు చేయటంలో అనుసరించాల్సిన విధానాలను గురించి ప్రజా సోషలిస్టునాయకులు చేసిన సూచనలు చివరకు కాంగ్రెసు-ప్రజా సోషలిస్టుపార్టీలు "మిశ్రమం కావటం" ఉచితమనే అభిప్రాయానికి దారి తీశాయి.

ఇది మొదటిప్రణాళిక అవటంచేత, దీనిని అనుకున్నట్లు పూర్తిగా అమలు చేసి తీరాలనీ, అలా అమలు చేయని పక్షంలో ద్వితీయ ప్రణాళిక కదిగటం హాస్యాస్పదం అవుతుందనీ, నెహ్రూ భావమట.

ప్రణాళికపైన వివిధ రాజకీయ నాయకులతో ప్లానింగ్ కమీషన్వారు జరిపిన చర్చలవల్ల తేలిన ముఖ్యాంశం- "ఈ ప్రణాళిక అనుకున్నట్లు ఫలితాల నివ్వదు," అని. అందువల్ల నెహ్రూ ఈ ప్రణాళికకాలంలో రాజకీయ భేదాలను విస్మరించి అంతా సహృదయతతో కృషిచేసి ప్రణాళికను సఫలం చేయించాలని విజ్ఞప్తిచేశారు.

### ప్రభుత్వంలోచేరైనా తోడ్పడా లని నెహ్రూ సూచన?

ఈ కృషి, 'ప్రభుత్వంలో ఉండిగాని, లేక బయటఉన్నా సరే,' చేయవలసిందని నెహ్రూ అభ్యర్థన అని ఒక ప్రజా సోషలిస్టునాయకుడు చెప్పాడు. ప్రభుత్వంలో ఉండి పని చేయటం బాధ్యతాయుతంగా ఉంటుందనికూడా ప్రధాని నెహ్రూ ప్రజా సోషలిస్టులకు సూచించారట.

గతనెల మొదటివారంలో శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ఢిల్లీలో శ్రీ నెహ్రూతో ఈ సూచనపట్ల తమ అభిప్రాయాలను తెల్పి, సవివరంగా చర్చలు జరిపారు. తత్ఫలితంగా దేశాభివృద్ధికోసం అనుసరించాల్సిన విధానాలను గురించి ఈ ఇద్దరికీ చాలా సన్నిహితభావాలు కలిగాయట. భూసంస్కరణలను నిర్దిష్టపు ఉత్పత్తిని సక్రమంగా త్వరగా సాధించటానికి అవలంబించాల్సిన విధానాలే ఇలాటి సమైక్యభావానికి దారి తీసినవట.

### మార్చి 15-న పార్లమెంటు ప్రజా సోషలిస్టులసభ

అయితే, ఇలాంటి కలయికకు ముందు వెనుకలు ఆలోచించాల్సి ఉంటుంది. రెండు పక్షాలవారు తమ తమ వారికి ఈ వివరాలను తెలియజెప్పి వారి అనుమతి తీసుకోవాల్సి ఉంటుంది. ముఖ్యంగా ప్రజలకు తెలియజేయాలి కదా. అందువల్ల ముందుగా ఈ నెల 15 తేదీ ప్రాంతంలో పార్లమెంటులోని ప్రజా సోషలిస్టు సభ్యుల సమావేశం జరిపి, జయప్రకాశ్ కె. బి. కృపలానీవారి అభిప్రాయాలను తీసుకొంటారని తెలుస్తోంది.

అదీగాక ప్రజాసోషలిస్టు పార్టీ ప్రదేశ కార్యవర్గాలు కూడా ఈలోగా తమతమ అభిప్రాయాలను తెలియజేస్తారట. ఆపైన ప్రజాసోషలిస్టుపార్టీ సర్వసభ్య సమావేశం (ప్రదేశ కార్యవర్గాల సభ్యులు, శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు) జరిపి తమ నిర్ణయాలను చేస్తారు. ఈ సమావేశం మార్చి నెలాఖరునో, లేక, ఏప్రిల్ మొదటివారంలోనో జరగవచ్చును.

### ఆంధ్ర రాజకీయాలపై ప్రకాశంగారి చర్చలు

ప్రకాశం పంతులుగారు ఆంధ్రదేశంలోని రాజకీయాలను గురించి నిన్న మొన్న జరిగిన ప్రజాసోషలిస్టు కార్యవర్గానికి సవివరంగా తెలియజేశారు. హైదరాబాదు రాజకీయాలను గురించి కూడా చర్చించారట. కొత్తగా ఏర్పడబోయే ఆంధ్రరాష్ట్రానికి కాంగ్రెసు-ప్రజాసోషలిస్టుల కలయిక,లేక 'మిశ్రమం' తప్పనిసరి అని-అలా కాకపోతే-ఆ ప్రాంతంలో కల్లోల రాజకీయాలు తప్పవని ప్రజాసోషలిస్టు కార్యవర్గం భావించినట్లు విదితమవుతోంది.

అయితే ఒక్క ఆంధ్రరాష్ట్రంలో మిశ్రమ మంత్రివర్గం ఏర్పరచి, మిగిలిన రాష్ట్రాల్లో ప్రభుత్వాలను వ్యతిరేకిస్తూ ఉండటం అసహజం.

కాబట్టి కాంగ్రెసుకు దేశం మొత్తం మీద అన్ని రాష్ట్రాలలో ప్రజాసోషలిస్టుల సహకారం లభిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వాలు ఇన్నాళ్లు అనుసరిస్తున్న కొన్ని విధానాలు మారుతవి.

కేంద్ర మంత్రివర్గంలో ప్రజా సోషలిస్టులు ఎవరు చేరుతారో, అసలు చేరుతారో లేదో ఇంత వరకు స్పష్టం కాలేదు. శ్రీ జయప్రకాశ్ నారాయణ్, ఆచార్య నరేంద్రదేవ్, శ్రీమతి సుచేతా కృపలానీ మంత్రివర్గంలో చేరుతారని మాత్రం వదంతులు వ్యాపిస్తున్నాయి. శ్రీ జయప్రకాశ్ మంత్రివర్గంలో ఉండకపోవచ్చునని ఒక సోషలిస్టు నాయకుడు అన్నాడు.

అయితే పార్లమెంటులోని ప్రజా సోషలిస్టుసభ్యు లెవ్వరూ ఈవిషయమై ఏమీ మాట్లాడటంలేదు. కాంగ్రెసు నాయకులు కూడా తమ కేమీ తెలియదని చెప్తున్నారు. మిశ్రమ మంత్రివర్గం అంటే, సోషలిస్టులకు సందేహాలు, కాంగ్రెసువారికి నాకారి కలుగుతున్నట్లున్నది. పండిట్ జీకి మాత్రం, పంచవర్షప్రణాళిక తప్ప రాజకీయపు పట్టుదలలు కనపడవట్లున్నదని ఒక మాజీ కేంద్రమంత్రి చమత్కరించారు.

మార్చి 8, 9 తేదీలలో జరగనున్న కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో ఈ విషయమంతా చర్చకు వస్తుందని భావించబడ్తోంది.

## బాపూజీ ఇచ్చిన విప్లవ సందేశం

### సఫలం కాలేదని వినోబాభావే

చాందిల్, మార్చి 2: సర్వోదయ సిద్ధాంతాలలో విశ్వాసంగల వారందరూ భూదాన యజ్ఞవిధానం సఫలం కావడానికి తమశక్తి సామర్థ్యాలను వినియోగించి కృషిచేయ్యాలని ఆచార్య వినోబాభావే యీవేళ ఉద్బోధించారు. ఈ సందర్భంలో ఆయన ఇంకా యిలా అన్నారు:

"పూజ్య బాపూజీ తలపెట్టిన కార్యక్రమం ఇంకా పూర్తికాలేదు. ఆయన తుది సందేశమైన 'యశో వామృత్యుర్వా' అనే సందేశానికం కా చెదవకలదు. కనుక ఈ సాంఘిక విప్లవ కార్యక్రమం విజయవంతం కావడానికి మనం కాయకష్టంలా కృషిచెయ్యడం సమంజసం." పి. టి. ఐ.

## మంత్రివర్గ పునర్నిర్మాణంపై కొండా లక్ష్మణ్ విమర్శ

### ఉపసంఘ సూచనలకు అనుగుణంగా లేదని ముఖ్యమంత్రికి లేఖ

హైదరాబాద్, మార్చి 4: ఇటీవల జరిగిన మంత్రివర్గపు పర్నిర్మాణం కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీవారు తమకిచ్చిన ఆదేశంయొక్క భావానికి అనుగుణంగా లేదని కొండా లక్ష్మణ్ గారు (కాంగ్రెసు యం. యల్. ఏ.) ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణరావుగారికి ఒక లేఖవ్రాసినట్లు తెలుస్తున్నది. తమ పార్టీవారు నియమించిన ఉపసంఘం యొక్క నివేదికననుసరించి మంత్రివర్గ పునర్నిర్మాణానికి తీసుకునే ఎట్టి చర్యలోనైనా తమ సహకారమిస్తామని పార్టీవారు పార్టీనాయకుడైన రామకృష్ణరావుగారికి హామీయిచ్చారు. మంత్రివర్గంలోని సంఖ్య 7 కు తగ్గకుండాను, 9 కి మించకుండాను ఉండవలెననీ, 4 గురు డిప్యూటీ మంత్రులనూ, 8 గురు పార్లమెంటరీ కార్యదర్శులనూ వేయవలెననీ ఉపసంఘంవారు సిఫార్సు చేశారు.

ఈ నెల 12 తే నాడు జరగనున్న పార్టీ సమావేశంలో యీ క్రింది తీర్మానాన్ని ప్రతిపాదించుటకు అనుమతియియ్యవలసినదిగా కొండా లక్ష్మణ్ గారు లేఖలో పార్టీనాయకుని కోరారు:

"ఉపసంఘంవారి సిఫార్సులప్రకారం మంత్రివర్గ పునర్నిర్మాణం చేయ చేయడానికి పార్టీవారు నాయకునికి యిచ్చిన ఆదేశాన్ని, మంత్రివర్గంలో యిటీవల జరిగిన తగ్గింపును సావధానంగా పరిశీలించినమీదట పార్టీ ఆదేశంలోని అసలు భావానికి భిన్నంగా మంత్రివర్గంలో పునర్నిర్మాణానికి బదులు తగ్గింపుమాత్రం జరిగినట్లు ఈసమావేశం వారు అభిప్రాయపడుతున్నారు. కొబట్టి, పార్టీ ఆదేశాన్ని సంపూర్ణంగా మరి ఏమాత్రమూ ఆలస్యం చేయకుండా అమలు జరుపవలెనని ఈ సభవారు పార్టీనాయకుని కోరుతున్నారు."

## గ్రామ ప్రజల అభ్యుదయానికి కృషి చెయ్యాడమవసరం

### గూడూరులో గవర్నరు శ్రీ ప్రకాశ ఉద్బోధ

[ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి]

నెల్లూరు, మార్చి 3: మదరాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశగారికి గూడూరులో నేటి ఉదయం పురపాలక సంఘంవారు స్వాగత పత్రం సమర్పించారు.

గవర్నరుగారి అంతరంగిక కార్యదర్శి శ్రీ హనుమంతు సాంబమూర్తి, మిలిటరీ అసిస్టెంటు శ్రీ భగవాన్దాస్ నెల్లూరు జిల్లా కలెక్టరు శ్రీ పి. వి. దళపతి ముదల్యార్, జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ ఆళ్వార్ నాయుడు, మున్నగు అధికారులు శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డి, బెజవాడ రామచంద్రారెడ్డి, తిక్కవరపు రామిరెడ్డి, చెంచు రామానాయుడు, ఏ. సి. సుబ్బారెడ్డి, దశరథరామయ్య, వంగల్లు కోదండరామిరెడ్డి, గోగినేని వెంకట సుబ్బయ్య నాయుడు మొదలైన జిల్లా అనధికార ప్రముఖులు సభకు హాజరైనారు.

గూడూరులో యిటీవలనే పురపాలక సంఘం నెలకొల్పబడింది. ఎన్నికలుజరిగినవి. ఇది మునిసిపాలిటీ అయిన తరువాత గవర్నరు ఇక్కడికి రావడం ఇదే ప్రథమం.

పురపాలక సంఘ సన్మాన పత్రము శ్రీ పి. సిద్దయ్య నాయుడుగారు చదివి సమర్పించారు.

### గవర్నరు ప్రసంగం

తరువాత మదరాసు అభ్రక పరిశ్రమదార్ల సంఘ స్వాగత పత్రము శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, దక్షిణ ఇండియా అభ్రకపు గనుల యజమానుల సంఘ పత్రమును శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు, చదివి సమర్పించారు.

పురపాలక సంఘసభ్యులు అభ్రకపుసంఘాల సభ్యులు గవర్నరుగారికి పరిచయం చేయబడిన తరువాత గవర్నరుగారు స్వాగతపత్రాలన్నిటికీ కలిపి యీ విధంగా ప్రత్యుత్తరమిచ్చారు:

"పురపాలకసంఘంవారు తమ స్వాగతపత్రములో తెలిపిన సమస్యలు, అన్ని పురపాలక సంఘాలకునువున్నవి. మీ పురపాలక సంఘం ఇటీవల స్థాపితమైనందున చాలా కాలంనుంచి వ్యవహారించే సంఘాలకున్నటి తీవ్రకష్టాలు సమస్యలు ఎదుర్కోవలసిన బాధ్యత యింకా మీకు ఇంతవరకు లేనందున మీరు అదృష్టవంతులనే చెప్పవలసియున్నది. విద్యుచ్ఛక్తి నీటిసరఫరా స్కీములు మంజూరు కావాలాని మీరు ఆశించడం న్యాయమే. ప్రమాణి వైద్య సౌకర్యాలను ఎక్కువ చెయ్యాలనీ మీరు ఆశిస్తున్నారు. జనాభా ఎక్కువయితే మనకష్టాలు మరీ ఎక్కువ అవుతవి. పట్నాలకు గ్రామాలనుంచి జనం ఎక్కువగా పోవడంచేత బాధలు ఎక్కువ అవుతున్నవి. గ్రామాభివృద్ధియే ముఖ్యమని గాంధీజీ ఆశయం. గ్రామాలలోని వారు వారి స్థావరాలను వదలి పట్నాలకు వెళ్లడంవల్ల పట్నాల సమస్యలు మరింత క్లిష్టం కావడమే కాకుండా గ్రామ ప్రాంతాలలో వ్యవసాయానికి అవకాశాలుతగ్గి ఆహార సమస్య క్లిష్టమవడం జరుగుతున్నది. ఒక దేశము ఇతర దేశంమీద ఆహారానికై ఆధారపడడం భావ్యంకాదు.

"రాష్ట్రం మొత్తంమీద నీటి సప్లయి సమస్యకూడా ఒకేరీతిగా క్లిష్టంగా నున్నది. పలుచోట్ల ప్రకృతి దయదలచలేదు. మీ సమస్యలను మీరు కొంత కొంత పరిష్కరించు కొంటున్నందుకు సంతోషం.

"నిరుపేద కార్మికజనం నివసించే ప్రభుత్వ కాలీ స్థలాలను మునిసిపాలిటీకి మార్చాలని కోరియున్నారు. పేద జనులను తమ నివాసములనుంచి తొలగించే సమస్య కష్టమైన విషయం. నిజంగా యిట్టి మురికి గూడెములను మన ముఖ్యమంత్రి చెప్పినటుల పర్థి పరచి అందునుగా నొనర్చడం ధర్మముగనుగాని ఉన్నతి తిరగతి వారల నిమిత్తం పేదవారిని నిరాశ్రయులు చేయడం న్యాయమైన విషయమని తోచదు. సామాన్యులయెడ ఆదరబుద్ధితో యీ సమస్యను ఆలోచించియే ఒక్కరికీ కష్టం కలుగని విధమున సమస్యను పరిష్కరించుకోవాలి. ప్రజాస్వామ్యంలో సామాన్యులు, అగ్రవర్గాలనే భేదమ్యం లేదు. ప్రతివారు సమానులే, అందరి శ్రేయమునకు అనుగుణమైన విధముననే మనం వ్యవహరించవలసిఉంటుంది. మనము సానుభూతితో మనకన్నా తక్కువవారి శ్రేయాన్ని ఆశిస్తూ అదను గుణంగా నడుచుకోవాలి.

"గూడూరు స్టేషనులో సౌకర్యాల కొరతలను గురించి చెప్పినారు. నేను స్వయంగా గూడూరు స్టేషనుమీదుగా కొన్ని పార్లు వెళ్ళియున్నాను. మీరు చెప్పినరీతిని ఆ స్టేషను అభివృద్ధి చెయ్యడం అవసరమే నని నాకు తోచింది. ఈ విషయమై సరిగ్గా వివరాలను మీరు నాకు తెలిపెట్టయితే కేంద్రప్రభుత్వ రైల్వేమంత్రితో యీ విషయమై చెప్పిచూడగలను.

### విద్యుచ్ఛక్తి రేటు

"అభ్రకపు గనులవారి పత్రములో విద్యుచ్ఛక్తి రేటు లేదాగురించిప్రస్తావించబడియున్నది గూడూరులో విద్యుచ్ఛక్తి రేటు ఇతర స్థలాలకంటే ఎక్కువగా నున్నదని మీరు చెప్పినారు ఇదేపధంగా విన్నెనెల్లూరులో కూడా వారు తమ పట్టణంలోని విద్యుచ్ఛక్తిరేటు ఇతర చోట్లకంటె ఎక్కువని తెలిపారు. ఎవరు చెప్పేది నిజమూ నాకు అర్థం కావేదు. ఆయా వ్యత్యాసాలు ఎక్కడ ఉన్నప్పటికీ రాష్ట్రం మొత్తంమీద విద్యుచ్ఛక్తి రేటును సమానంచేసే విషయం ప్రభుత్వం ఆలోచనలో వున్నది. మునసబుకోర్టు కావాలని మీరు కాంక్షించారు. మునసబుకోర్టుల సంఖ్య పెరిగిన కొద్దీ జనులలో తగవులు పెరగడమే జరుగుతుంది. నిజంగా ప్రజలశ్రేయస్సు ఆశించేవా రెవ్వరూ కోర్టులసంఖ్యను పెంచాలని కోరరు.

### ఆంధ్ర రాష్ట్రం

"ఆంధ్రులందరిదృష్టినిఇపుడుకలవరపరుస్తున్నది ఒక్క రాష్ట్రసమస్యయే. ప్రత్యేక రాష్ట్రం మీకు సిద్ధించాలని అందరూ ఆశిస్తున్నారు. అప్పుడు మీ రాష్ట్రం శ్రేయస్సే కోరుకున్నారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రయత్నం యే రీతిని శ్రేయస్కరముగా సాధించనగుననే విషయము పెద్దల మనస్సులను కలవరపరుస్తున్నది. ఈ సమస్య మీ రాష్ట్రానికి మాత్రమే సంబంధించినదని భావించరాదు. ఈ ప్రయత్నం జయాపజయాలమీద దేశ శ్రేయోభివృద్ధి ఆధారపడివున్నది. మీ ప్రయత్నంలో మీకు జయం కలుగుగాకయని ఆశిస్తున్నాను. నూతనరాష్ట్రం లోటుగా నుండును. కావున ఆయవ్యయాలను సరిపుచ్చుటకు కష్టం కావచ్చును. ఏదివిమైనప్పటికీ రాష్ట్రం యేర్పరచుకోవాలని కృతనిశ్చయంతో మీరున్నారు. కేంద్రప్రభుత్వం కూడా మీకు రాష్ట్రాన్ని ఏర్పరచడానికి నిశ్చయించింది.

"మీకోరికలు సఫలమగుగాక యని కోరుతున్నాను."

### పురపాలకసంఘంవారి స్వాగత పత్రం

గవర్నరు శ్రీప్రకాశకు గూడూరు పురపాలక సంఘం వారీ వేళ సాయంకాలం సమర్పించిన స్వాగతపత్రంలో తమపట్టణానికి ప్రస్తుతపు మంచినీటి సప్లయి ప్రణాళిక ఎంతమాత్రం చాలడం లేదనీ, లోగడ 25 వేల రూపాయలతో ఇప్పటి నీటిసప్లయి ప్రణాళికను విద్యుచ్ఛక్తి సహాయంతో అనుబంధిచేటందుకు వీలుగా శానిటరీ ఇంజనీరు తయారుచేసిన పథకాన్ని మూడు దశలుగా ఆమోదించాలని ప్రభుత్వాన్ని అభ్యర్థించారు.

గూడూరు స్టేషనును అభివృద్ధి చేయించడం చాలా అవసరమనికూడా ఆ విజ్ఞాపన పత్రంలో పురపాలక సంఘంవారు సూచించారు. ప్రస్తుతం గూడూరులో జిల్లా మున్సిఫ్ కోర్టు లేనందువల్ల ప్రజలకు చాలా ఇబ్బందిగావున్నది. కనుక గూడూరులో ఒక మున్సిఫ్ కోర్టు ఏర్పాటు చేయించమని పురపాలక సంఘంవారు అభ్యర్థించారు.

గూడూరులో విద్యుచ్ఛక్తి సరఫరా రేటు రాష్ట్రంలో యితర ప్రాంతాలకంటే ఎక్కువగా వున్నది కనుక రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి సప్లయి కంపెనీలన్నింటినీ ఒకే యూనిట్ గా పరిగణించి సర్వత్రా ఒకేరేటు ఏర్పాటు చేయించమని కూడా పురపాలక సంఘంవారు గవర్నరును అభ్యర్థించారు. గూడూరు పురపాలక సంఘం తరఫున చైర్మన్ పి. సిద్దయ్యనాయుడుగారు ఈ విజ్ఞప్తిని గవర్నరుకు సమర్పించారు.

### మైకాగనుల యజమానుల సంఘం విజ్ఞప్తి

మైకా పరిశ్రమ ప్రస్తుతం జాతీయ అంతర్జాతీయ వాణిజ్య రంగాలలో ఎదుర్కొంటున్న సమస్యలను వివరించుచూ మైకా పరిశ్రమ రక్షణకు భారతప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని అభ్యర్థించుచూ గూడూరు మైకా గనుల యజమానుల తరఫున బెజవాడ రామచంద్రారెడ్డిగారు గవర్నరు కొక విజ్ఞాపన పత్రం సమర్పించారు.

మైకా వృత్తికి కావలసిన పెట్టుబడి దేశంలో దొరకడం లేదనీ, గనుల యజమానులకు కార్మికులకు నడుమ ప్రస్తుతం సుహృద్భావ సంబంధాలున్నవనీ, ఈ పరిశ్రమ ప్రాముఖ్యాన్ని రాష్ట్ర ప్రభుత్వం గమనించాలనీ ఆ విజ్ఞాపనలో వున్నది. గనులు, లోహాల సలహా సంఘం నెలకొల్పే విషయం గురించి ఆలోచిస్తున్నందుకు రాష్ట్ర ప్రభుత్వంవారికి మైకా గనుల యజమానులు ఆ విజ్ఞాపనలో తమ కృతజ్ఞత వెలిబుచ్చారు. మైకాగనులలో పనిచేయడానికి తగినంతమంది సాంకేతిక నిపుణులు దొరకడం లేదని వివరించుచూ పాలిటెక్నికల్ కోర్సులో భాగంగా గాని, ప్రత్యేకంగాగాని మైకా ఇంజనీరింగు శిక్షణాలయం నెలకొల్పించ ప్రభుత్వాన్ని వారు అభ్యర్థించారు. మైకా పరిశ్రమను రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు ఇతోధికంగా ప్రోత్సహిస్తే దానివల్ల భారతదేశానికి అనేక ప్రయోజనాలు సిద్ధించగలవని కూడా వారు పేర్కొన్నారు.

# హైద్రాబాద్‌లో మోటార్లు, పెట్రోలుపై పన్ను హెచ్చింపు

## వచ్చే సంవత్సరం రాష్ట్ర ఆదాయంలో రు. 32 లక్షల లోటు అంచనా

హైదరాబాదు, మార్చి 3: సంస్థాన ఆర్థిక మంత్రి డాక్టరు జి. యస్. మేల్కోటేగారు 1953-54 సంవత్సరపు బడ్జెట్టును నేటిదినం శాసనసభకు సమర్పించారు. అందులో రూ. 32 లక్షలలోటు కనబడుతున్నది.

ఇప్పటి పన్నుల విధింపు ప్రకారం వచ్చే ఆర్థిక సంవత్సరానికి ఆదాయం రూ. 27 కోట్ల 90 లక్షలుగానూ, ఈ రెవిన్యూ ఖాతాక్రిందికి వచ్చేఖర్చు రూ. 28 కోట్ల 22 లక్షలగానూ ఆయన అంచనా వేశారు. అంటే 32 లక్షల రూ.ల లోటు వస్తుందన్నమాట.

అంచనా వేసుకొన్న ఈ 32 లక్షల లోటులోనూ 12 లక్షలు కొత్తపన్నుల మూలంగా భర్తీ అవుతాయని ఆర్థిక స్థితి అన్నారు.

ఈ బడ్జెట్టును ఇండియా కౌన్సిలులో నేటియాదుచేశారు.

తనవంతుగా హైదరాబాదుకు 1952-53 సంవత్సరానికి రూ. 941 లక్షలూ, 1953-54 సంవత్సరానికి రూ. 888 లక్షలూ రాగలవని డాక్టరు మేల్కోటేగారు చెప్పారు. ప్రైమరీ విద్యావ్యాప్తికిగాను వచ్చే నాలుగు సంవత్సరాలలో రూ. 120 లక్షల ప్రత్యేకగ్రాంటు వస్తుందనికూడ అన్నారు.

1951-52 లో అయిన రూ. 598 ...

### కొత్తపన్నులు

### దేవడలో ఘోరమైన అగ్ని ప్రమాదం

### హోసపేటలో అగ్నిప్రమాదం

# ప్రజాసభలో కాంగ్రెసు కమ్యూనిస్టు పక్షాల ఘర్షణ

## కలకత్తా రేవుకు అమెరికన్ డిస్ట్రాయర్లరాక సందర్భంలో

న్యూఢిల్లీ, మార్చి 3: ఇవాళ ప్రజాసభలో సుమారు 10 నిముషాల సేపు కాంగ్రెస్ కమ్యూనిస్టు సభ్యులు 'త్వంశుంఠ' అంటే 'త్వంశుంఠ' అను కోలాహలం జరిగింది. ప్రధాన మంత్రి నెహ్రూ కమ్యూనిస్టుపార్టీ ఉపనాయకుడు హీరేన్ ముఖర్జీ ఉద్రేక వశులై తీవ్రంగా ఘర్షణ పడ్డారు. కలకత్తాకు అమెరికా డిస్ట్రాయర్ల రాక గురించి చర్చ లేవదీయడానికి హీరేన్ ముఖర్జీ యత్నించడమే ఈ గొడవకు అంకురార్పణ. ఈ సందర్భంలో ముఖర్జీ ప్రతిపాదించ తలపెట్టిన వాయిదా తీర్మానాన్ని డిప్యూటీ స్పీకరు అనంతశయనం అయ్యంగారు తోసి వేశారు.

ముఖర్జీ ఇట్లా అన్నారు: అమెరికా డిస్ట్రాయర్లు 4 కొరియా యుద్ధ రంగం నుంచి ఫిబ్రవరి 28-వ కలకత్తా రేవుకు వచ్చాయనీ, నాటికి కావలసిన నీరూ బొగ్గూ, సరుకూ వగైరాలూ ఎక్కించుకొని తిరిగి వెళ్లిపోతాయనీ పత్రికలలో వార్తలవల్ల తెలుస్తోంది. ఈ లోగా ఈ డిస్ట్రాయర్లపైన పబ్లిక్ ఫంక్షన్స్ ...

తాము చెప్పిన విషయాలు తప్పు అని తెలిసిన తర్వాతకూడా సభ్యుడు దిద్దుకోలేదనే ప్రధానమంత్రి అన్నారన్నారు.

ఈగందరగోళంలో ఒకసారి ముఖర్జీ తాము మాట్లాడుతుండగా డిప్యూటీ స్పీకరు కలుగజేసుకోబోగా 'అవిధంగా మాటమాటకీ లేచి మీరు మమ్మల్ని నిరోధించజాలరు' అన్నారు. పార్లమెంటరీ సంప్రదాయ ప్రకారం అధ్యక్షస్థానంలోని వారు నిలబడి నప్పుడు సభ్యులెవ్వరూ నిలబడివుండరాదు. సభలో పట్టులేకుండా చేయడానికి ఇది తోడ్పడుతుంది. ముఖర్జీ అన్నమాటను ఒక కాంగ్రెసుసభ్యుడు అధ్యక్షునిదృష్టికి తెచ్చాడు. దానిమీద అయ్యంగారు, అది తాము గమనించలేదనీ, అధ్యక్షస్థానాన్ని ఉద్దేశించి ఆమాట అనివున్నట్లయితే అందుకు తాము చాలా చింతిస్తామనీ, ఈస్థానానికి చర్చ సక్రమంగా కొనసాగేటట్లు చూసే బాధ్యతతప్ప మరేవిధమైన పాక్షిక సంబంధం లేదనీ, ఒక పార్టీవ ...

ముఖర్జీ మొదట అధ్యక్షస్థానాన్ని విమర్శించే మాట ఏదీ అనలేదని అన్నారుగాని దరిమిలాను డిప్యూటీ స్పీకరు కనుక ఏమాటనైనా ఉపసంహరించుకోమనేటట్లయితే తప్పకుండా అట్లాచేస్తామన్నారు. ఆయన ఈమాట అన్నప్పుడు కాంగ్రెసు సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

# మద్రాసులో ఆంధ్ర తాత్కాలికరాజధానికి తమిళనాయకుల సుముఖ భావం?

## ముఖ్యమంత్రి రాజాజీ, కామరాజనాడార్‌గార్ల అంతరంగిక సమాలోచనలు

### ఢిల్లీ ప్రయాణానికి సన్నాహాలు

మద్రాసు, మార్చి 4: ఢిల్లీ వెళ్ళేముందు తమిళ నాయకులు మద్రాసులో ఆంధ్రులు తాత్కాలిక రాజధానిని పెట్టుకొనే విషయమై తమలో తాము సంప్రదింపులు జరిపి అంతర్వీక్షణ చేసుకుంటున్నారు. మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచారిగారు, తమిళ కాంగ్రెసు అధ్యక్షులు కె కామరాజనాడారుగారు మధుర, రామనాథపురము జిల్లాల పర్యటననుంచి ఇవాళ మద్రాసుకు తిరిగి వచ్చారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును మద్రాసులో తాత్కాలికంగా ఆంధ్రుల రాజధాని పెట్టుకోవడాన్నిగూర్చి తమిళ నాయకులు అంతరంగిక సంప్రదింపులు జరుపుతున్నారు రాజగోపాలాచారిగారిని కామరాజనాడారుగారు త్యాగరాయ నగరంలో ఇవాళ చూసి ఈ సమస్యలను చర్చించారు.

కామరాజనాడారు, భక్తవత్సలం గారలు రేపురాత్రి బయలుదేరి విమానంలో ఢిల్లీ వెడుతున్నారు. ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు 6వ తేదీ ఉదయం ఢిల్లీ వెడుతున్నారు. వీరు ప్రధాన మంత్రితో చర్చించిన తర్వాత కేంద్ర ప్రభుత్వ నిర్ణయం జరుగుతుంది. కార్యవర్గ సమావేశం ముందే నిర్ణయం జరుగవచ్చు.

తాత్కాలికంగా ఆంధ్రులు మదరాసులో రాజధాని పెట్టుకోరాదని తమిళనాయకులు ప్రసంగాలు చేస్తున్నా, తమవాదం నిష్పాక్షికులకు సబబుగా కనిపించడం లేదనీ, కొత్తపోతే ఒక పెద్దమనిషి ఒప్పందానికి లోబడి ఇక్కడ రాజధాని పెట్టుకోవడానికి అంగీకరిద్దామని భావిస్తున్నారనీ తెలుస్తోంది. భారతదేశమంతటికీ గవర్నరు జనరల్ చేసి అత్యున్నత పదవి నలంకరించిన రాజగోపాలాచారిగారు రాష్ట్రసమస్యవచ్చేసరికి సబబును గుర్తించలేక పోయారనే అపయశస్సు రాకూడదనీ, వేరే రాజధాని ఏర్పాట్లు చేసుకొనేవరకు ఆంధ్రులు ఇక్కడ ఉండాలని భారత ప్రధాన మంత్రి సూచించినప్పుడు, రాజగోపాలాచారిగారు అంగీకరించక తప్పదని వారి సన్నిహితులు అంటున్నారు. వారు ఇతర నాయకులను, ప్రజలను నచ్చచెప్పవలసిన స్థితిలో ఉన్నారు.

ఆంధ్ర తమిళ రాష్ట్రాలు విడిపోయాక ఆంధ్రదేశంపై తమిళులభూస్వాములకు, ఆంధ్రులు దక్షిణాదివారిపై వ్యాపారాలకు ఆధారపడవలసి ఉంటుందనీ, తాత్కాలిక రాజధాని విషయమై రగడచేసుకొని ద్వేషాలు పెంచుకోవడం మంచిదికాదనీ, పిమ్మట మున్ముందు ఇతర విషయాల్లో తాత్కాలిక రాజధాని మద్రాసులో ఉండటం తమిళులకే లాభకరమనీ తమిళనాయకులు అంతరంగికంగా అభిప్రాయపడుతున్నారు.

ఈ సందర్భంలో మధుర తమిళుల విజ్ఞాన కేంద్రమనీ, తమిళ రాజధాని మధురలో ఎందుకు ఉండరాదు అని రాజగోపాలాచారిగారు చేసిన ప్రసంగానికి వాగ్దానం చేస్తున్న ప్రసంగాలకు తేడా ఉన్నదని రాజకీయ వర్గాలవారు భావిస్తున్నారు. అయితే తమిళులు తమకు తాము తాత్కాలిక రాజధానికి ఒప్పుకున్నట్లుగాక కేంద్ర ప్రభుత్వ వత్తిడికి ఒప్పుకున్నట్లు కనిపించాలని యత్నిస్తున్నట్లున్నది.

ఈ సందర్భంలో తమిళ కాంగ్రెసు నాయకులు కొందరు చేస్తున్న ఆంధోళన-వేదికను ద్రవిడకజగం వారి పరం చేయరాదనే అని చెబుతున్నారు. ద్రవిడ కజగం వారితో కాంగ్రెసు నాయకులు ఏక వేదికపై మాట్లాడటం ...

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ వ్యవహారములను గూర్చి మార్చి పదవ తేదీ ప్రాంతాల భారతప్రభుత్వ ప్రకటన రావచ్చునని మద్రాసుప్రభుత్వ అధికారవర్గాలవారు భావిస్తున్నారు.

### వసంతోత్సవంలో అమానుష ప్రవర్తన

#### కాన్పూరు నగరంలో విషాదసంఘటన

కాన్పూరు, మార్చి 3: ఇక్కడ జరిగిన హోళీపండగ ఉత్సవాల సందర్భంలో ఒకబాలుడు ఒక పెద్దమనిషి మీద వసంతం చల్లినందున ఆయనకు కోపంవచ్చి ఆ పిల్లవాని చెయ్యినరికి వేశాడు. ఈ పట్టణంలోని ...

### బెంగాల్ ప్రధాని ఇంటి వద్ద నిరాహారదీక్ష

#### రాష్ట్రంలోనే పునరావాసం కావాలని కాందిశీకుల కోరిక

కలకత్తా, మార్చి 3: పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి డాక్టర్ బి సి రాయ్ గారింటి ఎదుట బెలింగటన్ స్క్వేరులో నలుగురు తూర్పు బెంగాల్ కాందిశీకులు ప్రాయోపవేశం ప్రారంభించారు. పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోనే తమకు పునరావాసవసతులు చూపించాలని వారి అభ్యర్థన. అనేక కాందిశీక కుటుంబాలకు తాము ప్రతినిధులమని వారు చెబుతున్నారు.

హౌరా, సియల్దా స్టేషన్లలో వారి కుటుంబాలు ప్రస్తుతం వున్నవని కూడా వారంటున్నారు. వారికి పశ్చిమ బెంగాలు రాష్ట్రం వెలుపలగల పునరావాస కేంద్రాలలో సౌకర్యం ఇవ్వబడింది. ఆ ప్రాంతంలో మానవులెవరూ నివసించడానికి వీలులేదని వారు ఇప్పుడు అంటున్నారు. పి. టి. ఐ.

# తాడేపల్లిగూడెంలో దోపిడి నేరానికి 95 మందిపై ఛార్జిషీట్

## 56 గురి అరెస్టు: జామీనుపై విడుదల

తాడేపల్లిగూడెం, మార్చి 2: ఆంధ్రరాష్ట్ర సాధనకై 58 రోజులు ప్రాయోపవేశ దీక్ష వహించిన పొట్టి శ్రీరాములుగారు మరణించినట్లు వార్త తెలియగానే, డిశంబరు 16వ తేదీన కొందరు స్టేషన్ పై దాడిచేసి, వాగన్లలోని బియ్యం లూటీచేసిన నేరానికిగాను ఇండియన్ పీనల్ కోడ్ 148, 355 382, 395, 149 సెక్షన్లక్రింద 95 మందిపై స్థానిక సబ్ మేజిస్ట్రేట్ కోర్టులో ఛార్జిషీటు దాఖలు చేయబడెను. స్థానిక సబ్ మేజిస్ట్రేటు శ్రీ పార్థసారథిగారు, యీ 95 మందికి వారంట్లు జారీ చేశారు. వీరిలో 56 గురిని అరెస్టుచేసి జామీనుమీద విడుదల చేశారు.

డిసెంబరు 16వ తేదీ ఉదయం పొట్టి శ్రీరాములుగారి మరణవార్త రేడియోద్వారా తెలియగానే, ఆరోజు సాయంత్రం, కొందరు రైలుస్టేషన్ పై దాడిచేశారు. వారు స్టేషన్‌లో ఎగుమతికి సిద్ధంగా ఉన్న వాగన్లలోని బియ్యం లూటీ చేయడం ప్రారంభించినట్లు సమాచారం అందగానే పోలీసు సర్కిల్, సబ్ ఇన్స్పెక్టర్లు స్టేషన్‌కు వెళ్ళి, ప్రజాసమూహాన్ని చెదరగొట్టుటకు రెండుసారు లాఠీచార్జి చేయడం, అప్పటికీ జనం చెదరిపోనందున కాల్పులు జరపడం, 9 మంది గాయపడి, వారిలో ఒకరు మరణించడం పాఠకులకు తెలిసిన విషయమే. ...

గోపాలం, ఈర్తి సహదేవులు, దోమేడు అప్పారావు, మల్లాది సుబ్రమణ్యం, దేవమణి, పిన్నింటి రాములు, శెట్టి అప్పన్న, చేకూరి రామన్న, చేకూరి అప్పన్న, రుతుం శాకల సత్యనారాయణ, కడలూరి సింహాచలం కొడవుంచి అబద్ధం, కోటిపల్లి కృష్ణ, పినిశెట్టి అప్పన్న, గవరం సీతారామయ్య, రాయపర్తి అప్పలస్వామి, పెనుగొండ మూకయ్య, సాలె గురవయ్య, దొడ్ల నారాయుడు, ... దీక్షితులు, యాళ్ల పోతు, కలవపూడి అదిలక్ష్మి, అన్నవోజు లక్ష్మీనారాయణ, కుండల అప్పలమ్మ, కొల్లి సుబ్బారావు, సైభోయిన అప్పన్న, బీనారెడ్డి అప్పాయమ్మ, పేరి మంగమ్మ, పేరిశెట్టియ్య, గార్ల గవరమ్మ, బి. నరసింహమూర్తి, కడియం అప్పలస్వామి, కొయ్య సన్యాసి, అల్లు గురవయ్య, బండారు పాపారావు, మాదిరాజు తులశమ్మ, పోలినాటి నారాయణమ్మ, చింతకాయల కొండలరావు, కుండల గంగన్న, కొయ్య పైడమ్మ, మిల్లు అప్పన్న, పువ్వుల మాణిక్యం, కేశవ అచెమ్మ, పిల్లి సంగులు, పేరిశెట్టి అప్పన్న, తేతా అప్పన్న.

# అరబ్బు రాజ్యాలను కూడగట్టుకోడానికి అమెరికా యత్నం

## మధ్యప్రాచ్య, ఆగ్నేయాసియాల్లో డల్లెస్ పర్యటన

### అరబ్బు రాజ్యాలపట్ల అమెరికా అధిక శ్రద్ధ

# ఆందోళన సాగిస్తూవుంటే రాజీసంప్రతింపులు సాధ్యంగాదు

## జమ్మూ ప్రజాపరిషత్తు ఉద్యమంపై ముఖర్జీ లేఖలకు నెహ్రూ సమాధానం

న్యూఢిల్లీ, మార్చి 3: జనసంఘ నాయకుడైన డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీకి, ప్రధాని నెహ్రూ, షేక్ అబ్దుల్లాగారలకూ మధ్య జనవరి 9 నుండి, రెండు మాసముల పర్యంతము, నడిచిన లేఖలను నేడు డా॥ ముఖర్జీగారు పత్రికలలో ప్రకటన నిమిత్తం విడుదల చేశారు.

భారతదేశంలో చేరి నిర్ణయాన్ని కాశ్మీరురాజ్యాంగ పరిషత్తు ధృవపరచవచ్చును. కాని యింతమాత్రం చేత సమస్య పూర్తిగా పరిష్కారం కాదు. సమస్య అంత్య పరిష్కారం మన కంట్రోలుకు అతీతమైన విషయాలతో ముడిపడివున్నది. అనేక విషయాలపై కాశ్మీరు పరిషత్తు యిదివరకే చర్య తీసుకున్నది. భారతదేశంలో చేరుతున్నట్లు అదివరలో చేసిన నిర్ణయాన్ని ధృవపరచడం కంటెగూడా యెక్కువ చేసినది.

రాష్ట్రీయ స్వపరిపాలనమును మనం గౌరవించాలి. మనం సలహా యివ్వవలసిన వారమేగాని, వారి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొనగూడదు.

### ఫిబ్రవరి 15 తేదీ లేఖ

# సుంకాలు పెరిగిన వస్తువుల దిగుమతి

## కేంద్రప్రభుత్వ కొత్త విధానం

న్యూఢిల్లీ, మార్చి 3: అర్థిక బిల్లు మేరకు దిగుమతి సుంకాలు పెరిగిన కొన్ని వస్తువుల విషయములో తను దిగుమతి విధానంలో, జనవరినుంచి జూనుదాకా, ధారాళత చూపడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది.

కొన్ని కొన్ని నిషిద్ధ వస్తువులకు లాంఛన కోటాలు ఉన్నట్లయితే వాటిని పెంచుతారు.

1949 నుంచి దిగుమతి నిషేధింపబడి యుండిన నూలు, పట్టుగుడ్డలకు నూటికి 10 వంతుల కోటా ఇవ్వబడింది. ఇలాగే మేజోళ్ళు, బూట్లు, పాదరక్షలు, గొడుగులు, బొత్తాములు మొదలైన వాటికికూడ ఇదే నూటికి 10 వంతుల కోటాలు ఇవ్వబడ్డాయి.

దిగుమతి నిషేధింపబడి యుండిన పాత వార్తా పత్రికలకు ఇప్పుడు నూటికి 30 మేరకు లైసెన్సు ఉంటుంది. అంగరాగ ద్రవ్యాల కోటాను రెండింతలు చేశారు. పైగా వీటి దిగుమతి విషయంలో పెట్టి యుండిన నిర్బంధాలుకూడ తీసి వేశారు.

సీసపు పెన్సిళ్ల కోటాను నూటికి 20 నుంచి 30 కి పెంచారు. కొని వెలల ప్రమాణాన్ని మాత్రం అట్లాగే (గ్రోసు 16 రూ.) ఉంచారు.

మట్టివస్తువులు, చీనా పింగాణీ వస్తువులు, గాజు, గాజువస్తువుల కోటాలు కూడ పెరిగాయి. కాని గాజుకోటాల దిగుమతిపై నిషేధం మాత్రం అట్లాగే నిలబెట్టారు.

వక్కలదిగుమతి కోటా మాత్రం పెంచలేదు. కాని దానివిషయంలో ఇప్పుడు లైసెన్సుపద్ధతి పెడతారు.

# 'సరిహద్దు నిర్ణయ సంఘం ఏర్పడాలి'

## ప్రధాని నెహ్రూకు కన్నడిగుల విజ్ఞప్తి

న్యూఢిల్లీ, మార్చి 3: బళ్లారిని ఆంధ్రరాష్ట్రంలో చేర్చరాదని కోరుతూ, బళ్లారిజిల్లా కర్ణాటక కార్యాచరణ సభ్యులు 5 గురు నేడు ప్రధాని పండిత నెహ్రూకు, రాష్ట్రాల మంత్రి డా॥ కట్జూకూ, కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులకు ఒక విజ్ఞప్తి సమర్పించారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకుపూర్వము ఆంధ్ర-కర్ణాటక సరిహద్దు నిర్ణయానికి ఒక బౌండరీ కమిషను యేర్పరచాలని మెమొరాండం కోరుతున్నది.

బళ్లారి జిల్లాను ప్రక్కనున్న మైసూరులో కలిపి వేయాలి. ఇది సాధ్యం కాకపోతే, అవశిష్ట మద్రాసురాష్ట్రంలో వుంచాలి. తాత్కాలికం గూడా ఆంధ్రరాష్ట్రంలో చేర్చరాదు' అని ఈ 5 గురు కర్ణాటకులు తమ విజ్ఞప్తిలో కోరుతున్నారు.

# కలకత్తాలో కమ్యూనిస్టుల ప్రదర్శనలు

## అమెరికన్ యుద్ధ ఓడల రాకకు ప్రాతికూల్యం

కలకత్తా, మార్చి 2: హుగ్లీనదిమీద వున్న ప్రిన్సెస్‌ఘాటు వద్ద నేడు కమ్యూనిస్టులు అరగంటసేపు ప్రదర్శనలు చేశారు, పెట్రోలు పోసుకోడానికిగాను నాలుగు అమెరికన్ యుద్ధ నావలు యిక్కడ ఆగాయి. ఈనావలు భారతదేశంనుండి వెళిపోవాలని, సైనా మూనావ సైనానువదలాలని కోరియూ నుండి వెళ్లిపోవాలని వీరు కేకలు వేశారు. మొదట మైదానంలో గొప్ప సమావేశం జరిపి తిరువాత ఘట్టంవద్దకు వెళ్లి నినాదాలు చేశారు. ప్రెసిడెంటు ఐసెన్ హోవరు ఆకృతిని తగల పెట్టారు.

పోలీసులు నదీతీరమున కాపలా కాస్తున్నారు. కాని జోక్యం కలిగించుకోలేదు.

ఆసమయమున ఒక అమెరికన్ నావలో ఫెల్చు చూపుతున్నారు. స్థానిక అనాధాశ్రమ శిశువులకు నావికులు విందు చేస్తున్నారు.

## తారాసింగ్ కేసు వాయిదా

అమృతసర్, మార్చి 2: మాస్టర్ తారాసింగ్ ప్రభృతి 11 మంది అకాలీనాయకులపై పెట్టబడిన కేసు విచారణ 17-వ తేదీకి వాయిదా పడింది.





తణుకు తాలూకా వెలగదుర్రు పంచాయతీబోర్డు అధ్యక్షులుగా ఎన్నికైన ముదునూరి బాపిరాజు గారిని గుర్రంపై ఊరేగిస్తున్న దృశ్యం.

# 'వాంచూ నివేదిక ఇంకా అందలేదు'

## మద్రాసు ఆర్థికమంత్రి ప్రకటన

మద్రాసు, మార్చి 2: "వాంచూ నివేదిక ప్రతి మద్రాసు ప్రభుత్వానికి ఇంకా అందలేదు. మద్రాసు ముఖ్యమంత్రికి వ్యక్తిగతంగా ఏమన్నా వచ్చిందో లేదో నాకు తెలియదు" అని మద్రాసుప్రభుత్వ ఆర్థికమంత్రి సి. సుబ్రహ్మణ్యంగారు నేడు పత్రికా ప్రతినిధులకు చెప్పారు.

మద్రాసు ఆంధ్రులకు తాత్కాలిక రాజధాని కావాలనీ, తిప్పితే వాల్తేరు చేసుకోవచ్చునని వాంచూగారు సూచించారన్న వార్తను పురస్కరించుకొని ఆర్థికమంత్రి "ఆంధ్ర రాజధాని ఆంధ్రప్రాంతంలోనే ఉండటం మంచిది" అన్నారు. కొంతి కాలం ఉంటే శాశ్వతంగా ఉండాలని బుద్ధి పుడుతుందన్నారు.

వాంచూ నివేదిక ముఖ్యమంత్రికి వచ్చినదా అనగా "ప్రభుత్వానికి రాలేదు. వ్యక్తిగతంగనే వచ్చిఉండవచ్చు. అయితే ప్రభుత్వానికి అందక పూర్వమే చాలా వార్తలు పత్రికలకు తెలుస్తున్నాయి" అని మంత్రిగారు అన్నారు.

# భీమవరం మున్సిపల్ ఎన్నికదావాలకొట్టివేత

## పిటీషనర్ల ఖర్చులు యిచ్చుకోవాలని తీర్పు

నరసాపురం, ఫిబ్రవరి 28: స్థానిక సబుజడ్జియున్ను, ఎలక్షను కమీషనరు అయిన శ్రీ ఇ. ఆదికేశవన్‌గారు భీమవరం మునిసిపాలిటీ తాలూకు మూడు ఎన్నికల పిటిషనులు ఈ నెల 28వ తేదీ కొట్టివేస్తూ పిటిషనర్లు ఖర్చులు యిచ్చుకోవలసినదిగా తీర్పు యిచ్చారు.

మారెళ్ల కృష్ణరావుగారు పి. అనసూయ, జి. జగన్నాధరాజు గార్లపైనను, పి. సత్యనారాయణగారు. జి. జగన్నాధరాజు గారిపైనను, వారి ఎన్నికల నామినేషను చెల్లకూడదనిని పిటిషనులు పెట్టారు. ఆయా సెక్షన్లను ఉపహరించి ఎలక్షను కమీషనరుగాను, పిటిషనర్ల వాదనలు చెల్లనేరవని కొట్టివేశారు. (స్వ. వి.)

# ఆంధ్ర జింఖానా క్లబ్బు

## నూత్నకార్యవర్గం ఎన్నిక

విజయవాడ, మార్చి 1: జనాబ్ కె. యం. హుస్సేన్ (రిటైర్డు పోలీసు ఇనస్పెక్టరు జనరలు) గారి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర జింఖానాక్లబ్బు సర్వసభ్య సమావేశంలో, యీ దిగువవారు నూతన కార్యవర్గమునకు ఎన్నికైనారు. రాజా యార్లగడ్డ శివరామప్రసాదు (చల్లపల్లి రాజాగారు) అధ్యక్షులు, జనాబ్ కె. యం. హుస్సేన్ గారు ఉపాధ్యక్షులు, శ్రీ యం. యస్. రాజుగారు కార్యదర్శి, శ్రీ యస్. పార్థసారథి వరప్రసాదు, పి. విశ్వనాథశాస్త్రిగారలు సహాయ కార్యదర్శులు శ్రీయుతులు కె. నారాయణరావు, యస్. యం. అబ్దుల్ ఖుద్దూస్, యం. జయరామరావు, కె. శ్రీరామమూర్తి, కె. దుర్గాప్రసాదరావు, జి. శ్యాంబాక్, డి. భోగేశ్వరరావు, ఆర్. రాఘవరావు, బి. ధర్మరాజ్, యం. వీరరాఘవయ్యగారలు కార్యవర్గ సభ్యులుగాను ఎన్నుకోబడ్డారు. క్లబ్బులో విద్యుద్దీపాలు (ఫ్లడ్ లైట్సు) అమర్చబడిన టెన్నిసుకోర్టును యేర్పాటు చేయుటకు నిర్ణయించబడింది.

## దొడ్లేరు గ్రామంవద్ద అజ్ఞాత శవం

పల్లెవపల్లి, ఫిబ్రవరి 28: దొడ్లేరు గ్రామమునకు షుమారు 3 మైళ్ళ దూరములో అడవి మార్గమున ఒక అజ్ఞాతి వ్యక్తి శవము 25వ తేదీన కనుగొనబడినది. షుమారు 40 సంవత్సరముల వయస్సు, 5 అడుగుల 5 అంగుళముల ఎత్తు, చామనుచాయ, తెల్లనిసిల్కు ధోవతి, తెల్లనిస్లు మొల త్రాడుకు వెండి, బంగారు తాయత్తులు యున్నవి. శవము ప్రక్కన ఒక పెరిమాన కత్తి, పొగాకు పంచి, పడియున్నవట. తలపైన బలిని పొటున్నట్లు తెలుస్తున్నది. యీ వ్యక్తి ఎవరైనది తెలియనందున పల్లెవపల్లి పోలీసు ఆచూకి నిమిత్తం ప్రయత్నిస్తున్నారు. (స్వ. వి.)

# జమ్మూలో ప్రజాపరిషత్తు అనుచరులపై పోలీసు కాల్పులు

## ఒకని మరణము ఇద్దరికి గాయాలు

జమ్మూ, మార్చి 2: ఇక్కడికి 110 మైళ్ల దూరమున జమ్మూ-శ్రీనగర్ రోడ్డు మీదవున్న రాంబాన్‌లో ప్రదర్శనలు చేసిన ప్రజా పరిషత్తు అనుచరులపై పోలీసులు తుపాకులు కాల్చారు. ఒకడు మరణించాడు, ఇంకా యిద్దరు గాయపడ్డారు.

ప్రజా పరిషత్తుకు చెందిన 2 వేల మంది ఒక పోలీసు స్టేషనుమీద దాడి చేశారు. వెళ్లిపోవ నిరాకరించగా లాఠీ ఛార్జి చేయాల్సిందని డ్యూటీపైవున్న మేజిస్ట్రేటు ఆజ్ఞాపించాడు. అంతట జనసమూహం రాళ్లు రువ్వనారంభించారు. తుపాకులు కాల్చాల్సిందని మేజిస్ట్రేటు పోలీసులను ఆదేశించాడు. తరువాత జనసమూహం వెళ్లిపోయారు.

# హోళీ సందర్భమున అలహాబాదులో సంఘర్షణలు

## 23గురి అరెస్టు

అలహాబాదు, మార్చి 2: హోళీపండుగ సందర్భమున అలహాబాదులో 6 చోట్ల సంఘర్షణలు జరిగాయి. మొత్తం 23 గురు అరెస్టయినారు. నయాబస్తీలో యిద్దరు రైల్వే పోలీసులపై రంగు చల్లారు. పోలీసులు ఆగ్రహించగా ప్రజలు వారిని చుట్టుముట్టారు. ఒక కానిస్టేబులుకు గాయాలు తగిలాయి. వెంటనే అక్కడికి పోలీసు బలగం వెళ్లింది. ముగ్గురిని అరెస్టు చేశారు. తరువాత ప్రజలు పోలీసు స్టేషను యెదుట చేరి అరెస్టయినవారిని విడుదల చేయాలని ప్రదర్శనలు చేశారు. వీరిలో 14 గురిని అరెస్టు చేసిన తరువాత ప్రజలు వెళ్లిపోయారు.

రైల్వేస్టేషను వద్ద ఒక సైనికునికి గాయాలు తగిలాయి. 6 గురు అరెస్టయినారు. అధికార్లు 144 సెక్షను ప్రయోగించారు.

# హిందూ సభ ఊరేగింపుపై రాళ్లు

## కొట్లాటలలో 11 మంది మరణం

అహమ్మదాబాదు, మార్చి 2: నిన్న వీరంగాంలో జరిగిన కొట్లాటలలో 11 మంది మరణించారు. ఇంకా 111 మంది గాయపడ్డారు.

గోవధ నిషేధించాలని కోరడానికి హిందూమహాసభ చేసిన ఊరేగింపుపై ఎవరో దుండగులు రాళ్లు రువ్వినప్పుడు ఈ కొట్లాటలు ప్రారంభమైనవి.

పట్టణంలో 40, 50 యిండ్లు తగలబడిపోయినవి. అహమ్మదాబాదునుంచి నిన్న వెళ్లిన రెండుఅగ్ని మాపకదళాలు మంటలతో పోరాడి అర్ధరాత్రి సమయమున మంటలు చల్లార్చారు.

16 మంది అరెస్టయినారు. వీరంగాం పరిస్థితి పూర్తిగా అదుపులోనికివచ్చిందని అక్కడికి వెళ్లివచ్చిన జిల్లా మేజిస్ట్రేటు తెలియజేశారు.

# కాలువలో పడిముగ్గురు పిల్లల దుర్మరణం

## ఆగ్రా సమీపంలో విషాద సంఘటన

ఆగ్రా, మార్చి 3: ఇక్కడికి కొద్ది మైళ్ళ దూరంలో ఒక కాలవ వొడ్డున కొంత మంది పిల్లలు ఆడుకొంటూండగా ఒక పిల్లవాడు ప్రమాద వశాత్తు కాలవలో పడిపోయినాడట. తన మిత్రుని కాపాడడానికై వరుసగా అయిదుగురు పిల్లలు ఒకరి తరువాత మరొకరు ఆ కాలవలో దూకారు. తమ స్నేహితుని వారు తప్పించలేకపోగా, వారుకూడా ప్రమాదంలో చిక్కుకుని సహాయంకోసం బిగ్గరగా అరిచారట. సమీప గ్రామస్థులు అక్కడికి వచ్చి ప్రయత్నించగా మొత్తం ఆరుగురిలోను ముగ్గురు పిల్లలను కాపాడ కలిగారు. మిగతా ముగ్గురి శవాలను కూడా ఆగ్రామస్థులు బయటకు తీశారు. (పి. టి. ఐ.)

# మొరాకోలో భారత రాజకీయ ఉద్యోగి పర్యటన

## పరిస్థితులు పరిశీలించి నివేదిక తయారుచేయవచ్చునట

పారిస్, మార్చి 2: ఇక్కడి భారత రాయబారి సర్దార్ హార్దిత్ సింగ్ మాలిక్ మొరాకోలో మూడువారాలపాటు పర్యటించే నిమిత్తం నేడు బయలుదేరి వెళ్ళారు. ఆయన భార్యకూడా వెంట వెళ్ళారు.

ఇది వ్యక్తిగత హోదాలోనే జరుగుతున్న పర్యటన అనీ, అయితే ఈ అవకాశాన్ని వినియోగించుకొని ఆయన అక్కడి పరిస్థితులపై ఒక నివేదిక తయారుచేసి భారత ప్రభుత్వానికి పంపవచ్చుననీ రాయబారి కార్యాలయ వర్గాలలో అన్నారు.

## సమావేశం 'సమాచారం తెలుసుకొనేందుకే'

కాసాబ్లాంకా, మార్చి 3: పారిస్‌లోని భారత రాయబారి సర్దార్ మాలిక్ విమానంమీద గతరాత్రి ఇక్కడికి వచ్చారు. వారికి కాసాబ్లాంకా ప్రాంతాధికారి స్వాగతమిచ్చారు.

'అందమైన ఈ దేశంగురించి నాకేమీ తెలియదు. తెలుసుకొనేందుకే వచ్చాను.' అని ఆయన అన్నారు. ఇక్కడి ముస్లిములను కూడా కలుసుకొంటారా అని అడగ్గా, 'తప్పకుండా, ఈ నా పర్యటన వ్యక్తిగతమైన దైనా సమాచారం తెలుసుకొనేందుకు కూడా' అని అన్నారు. జాతీయ నాయకులను కలుసుకోబోతున్నారా అని అడగగా 'నేను అందరినీ చూస్తాను' అన్నారు. మాలిక్‌తో వారి భార్య, రాయబార కార్యాలయోద్యోగి బి. దాస్ కూడా వచ్చారు.

# సూయజ్ నుంచి బేషరతు నిర్గమనం

లండన్, మార్చి 2: సూయజ్ ప్రాంతంనుంచి బ్రిటిష్‌సేనల నిర్గమనం బేషరతుగా జరగాలని ఈజిప్టు ప్రభుత్వం లాంచనంగా కోరలేదనీ, బాధ్యతగల ఈజిప్టు పెద్దలు బహిరంగ ప్రకటనలుమాత్రం చేశారనీ స్టేట్‌మంత్రి సెల్విన్ లాయడ్ అన్నారు.

# చర్చిల్ తిరస్కృతి

లండన్, మార్చి 2: మలయాలో ఉరిశిక్ష విధించబడిన కమ్యూనిస్టు వనిత లీ మెంగ్ ను వదిలిపెడితే, తమఅధీనంలో ఖైదీగావున్న బ్రిటిష్ వ్యాపారి ఎడ్గార్ శాండర్స్‌ను వదిలిపెడతామని హంగరీచేసిన సూచనను ప్రధాని చర్చిల్ నేడు తిరస్కరించారు.

# పత్రికోద్యోగుల కర్తవ్యాలు

## టి. టి. శర్మగారి అభిభాషణ

మైసూరు, ఫిబ్రవరి 28: కర్ణాటక ప్రభుత్వ పత్రికారచయిత, విశ్వకర్ణాటక సంపాదకుడుఅయిన టి. టి. శర్మగారు మహారాజా కాలేజి పత్రికోద్యోగుల సంఘంలో మాట్లాడుతు పత్రికోద్యోగుల గురుతర బాధ్యతలను గూర్చి నొక్కి వక్కాణించారు.

"ముద్రణాలయంలోని పనులు రాను రాను చాలా కఠినతరమౌతున్నవి. పుస్తకజ్ఞానముకంటెను తగినంత అనుభవం కూడ అత్యవసరం. అందువల్ల బోధనా కార్యక్రమంలో అనుభవజ్ఞానార్జనకు తగిన స్థానం కల్పించా"లన్నారు.

"ఈ వుద్యోగం అపూర్వమైనది; శ్రేష్ఠమైనది, పూజ్యమైనది. అంతేకాదు. బాధ్యతాయుతమైనదికూడాను. పత్రికోద్యోగి తనపైగల బాధ్యతను దురుపయోగ పరచినట్లయితే సంఘానికే గొప్ప ద్రోహం చేసినవాడవుతాడు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత హిందూదేశంలోని పత్రికలలో పోరాడు ఉద్దేశం నశించిపోయినందుకు చాలా విచారించారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పత్రికోద్యమానికి కొరత, కళంకం వచ్చిందన్నారు.

ఇదొక పరిణామకాలమనీ, దేశభవితవ్యాన్ని మూర్తీకరించటంలో ప్రస్తుతం వార్తాపత్రికల బాధ్యత ఎంతైనా ఉన్నదనీ వక్కాణించారు.

పత్రికోద్యోగి ఒక ఆశయవాదిఅనీ, అతడు లోకకల్యాణానికి సత్య ప్రయోగం చేస్తూ, సత్యస్థాపనకుగాను పోరాడవలసిందనీ చెప్పుతూ విద్యార్థులకు సలహా ఇచ్చారు.

సంఘాధ్యక్షుడు నంజియూరుగారు అధ్యక్షత వహించారు. (స్వ. వి.)

# పెన్సిళ్లు, సిరాల ధరలు పెరిగేసూచన

న్యూఢిల్లీ, మార్చి 2: విదేశాలలో తయారయ్యే అన్నిరకాల పెన్సిళ్ళు, ఫౌంటెన్ పెన్ల సిరాల ధరలు దిగుమతి సుంకాల పెంపకంవల్ల నూటికి 20 లేక 30 పాళ్లు పెరిగే సావకాశంవుంది. అట్లాగే బూట్లూ, మేజోళ్లూ, గొడుగుల వెలలుకూడా పెరగగలవు.

# నూతన ఆంధ్రరాష్ట్రానికి సుస్థిర ప్రభుత్వం

## స్వామిసీతారాం ఆశాభావం

గుంటూరు మార్చి 2: ఆంధ్రప్రజల వాంఛితములకు అనుగుణంగానే ఆంధ్రరాష్ట్రావతరణ జరుగగలదని, నూతన ఆంధ్రరాష్ట్రమునకు, స్పష్టమైనట్టి, సమర్థమైనట్టి ప్రభుత్వం యేర్పడగలదని స్వామీసీతారాం, నేడిక్కడ తమ ఆశాభావాన్ని వెల్లడించారు.

భారతపితి బోధించిన సిద్ధాంతములకనుగుణంగా ఆంధ్రజాతి అభివృద్ధి పొందగలదని తమ గాఢ విశ్వాసమని అన్నారు.

స్వామీ సీతారాం వినయాశ్రమం నుండి నిన్న సాయంత్రం యిప్పటికి వచ్చి, వెంటనే, ఎక్స్‌ప్రెస్‌లో చాందా వెళ్లుటకు, విజయవాడకు ప్రయాణమై వెళ్ళారు. (స్వ. వి)

# బ్యాంకు తగాదాలు

## ట్రిబ్యునల్ అవార్డును ప్రకటించాలని అభ్యర్థన

విజయవాడ, మార్చి 2: సాధ్యమైనంత త్వరలో పారిశ్రామిక పరిష్కారసంఘంవారు బ్యాంకితగాదాల అవార్డును ప్రకటించాలని, యిళ్ళ ఎద్దడి, విపరీతమైన అద్దెలు, దృష్టిలో వుంచుకుని పట్టణాలు నగరాలు వారీగా విభజించేటప్పుడు విజయవాడ, విశాఖపట్నం పట్టణాలను "ఏ" తరగతిలో చేర్చాలనీ, ప్రభుత్వాన్ని ఉద్యోగులు నిన్న యిక్కడ జరిగిన బ్యాంకివుద్యోగుల సమావేశంలో తీర్మానించారు. పనిచేసే వేళల (శనివారంనాడు తదితర రోజులు) విషయంలో బ్యాంకి అధికార్లు నిబంధనల ననుసరించాలని కోరుతూ వారానికి రెండుసార్లు అయినా లేబరు ఆఫీసర్లను తనిఖీకై పంపాలని ప్రభుత్వాన్ని కోరుతు మరో తీర్మానం చేశారు.

## ఐ. యల్. టి. డి. కంపెనీ విధానం

## శ్రీ బాచిన సుబ్బారావుగారి విమర్శ

గుంటూరు, మార్చి 3: పొగాకు మార్కెటు కమిటీవారు ప్రవేశపెట్టిన బహిరంగ వేలముపద్ధతిని విఫలమొనర్చుటకు ఐ. యల్. టి. డి. కంపెనీవారు కృషి చేస్తున్నారనీ, యీ వేలం పద్ధతి అములులోవున్న కేంద్రాలలో కంపెనీ వారు పొగాకును స్వల్పధరలకు కొనడమో, లేక మానడమో జరుగుతున్నదనీ, తత్ ఫలితంగా రైతులు నష్టపడుతున్నారనీ, అలా నష్టపరచి రైతులచే యీ విధానం వ్యతిరేకింపజేయాలనీ కంపెనీవారు ప్రయత్నిస్తున్నారని, కనుక యిది గమనించి ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవాలని శ్రీ బాచిన సుబ్బారావుగారు ప్రకటిస్తున్నారు.

## మార్కాపురం తాలూకాలో గంజికేంద్రాలు స్థాపించాలి

మార్కాపురం, మార్చి 3: ఈ తాలూకాలో మంచినీటి కొరతతోపాటు పంటలు నశించినందున, ప్రజలు యితర ప్రాంతాలకు వలస వెళ్లారనీ ప్రభుత్వం అనుమతి లేనిదే కాంట్రాక్టరులు పనులు ఆరంభించుటకు జంకుతున్నారనీ, యీ పరిస్థితిలో శిస్తువసూళ్లు అక్రమం గనుక ప్రభుత్వం వెంటనే శిస్తువసూళ్లు అపుజేసి, రెమిషన్ ప్రకటించాలనీ, గంజికేంద్రాలు స్థాపించాలని, మహిళా సంక్షేమ కేంద్రాలు నెలకొల్పాలనీ, తాలూకా కాంగ్రెసుసంఘ కార్యదర్శి శ్రీ ఒ. వి. రమణయ్యగారు ప్రకటిస్తున్నారు.

భీమవరం, మార్చి 2: స్థానిక యన్. జి. వో. సంఘ అధ్యక్షులు శ్రీ యస్. సూర్యనారాయణగారు శ్రీకాకుళం జిల్లాకు బదిలీకాబడిన సందర్భంలో నాన్ గెజిటెడ్ వుద్యోగులు శ్రీ పాదూరి జగ్గయ్యగారి అధ్యక్షతన సమావేశమై వీడ్కోలు విందు చేశారు.

బొంబాయి సెంట్రల్ కాటన్ కమిటీ టెక్నలాజికల్ లేబరేటరీలో తయారైన అతిసున్నితమైన త్రాసు. ఇది చిన్నచిన్న దూదిపోచల తూకాన్నికూడ కనిపెట్టి చూపుతుంది.


అది లవలేశం తయారైన మరొక త్రాసు. ప్రత్తినుంచి వచ్చిన విపరీతపు దారపు తేనే తూకాన్ని ఇది అతి లవలీలగా అరక్షణంలో తెల్పుతుంది.

న్యూయార్కులో ఐక్యరాజ్యసమితి సమావేశ ప్రారంభానికి హాజరైన సోవియట్ ప్రతినిధి విషిన్‌స్కీ, రష్యా రాయబారి జరూబిన్.

# బొంబాయి ప్రత్తి పరిశోధనాలయం

## నూలు, ప్రత్తిపరిశ్రమల అభివృద్ధికి చేస్తున్న అవిరళ కృషి

ప్రత్తినూలు పరిశ్రమల పరిశోధనలకు భారత ప్రభుత్వం ప్రస్తుతం వినియోగిస్తున్న ధనంవల్ల త్వరలో భారతీయ ప్రత్తి పరిశ్రమ స్వయం సంపూర్ణం కాగలదు. పైగా ఇండియా ఇతర దేశాలకు ప్రత్తిని ఎగుమతి చేయవచ్చు కూడా తత్ఫలితంగా భారతీయుల ఆర్థిక స్థితిగతులు అభివృద్ధిచెందే మంచి రోజు రావచ్చు.

ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీకి చెందిన పరిశోధనాలయం డైరెక్టరు డాక్టరు సి. నంజుండయ్యగారు పై అభిప్రాయాలు వెల్లడించారు. ఈ పరిశోధనాలయం బొంబాయిలో వున్నది. గత 28 సంవత్సరాలనుంచి ప్రత్తిద్వారా విదేశాలనుంచి ఇండియా ధనం సంపాదించడానికి ఈపరిశోధనాలయం కృషి చేస్తున్నది.

### ఆధునిక పరికరాలు

డాక్టర్ నంజుండయ్యగారి అధ్యక్షతను 40 మంది శాస్త్రవేత్తలు ఈ పరిశోధనాలయంలో ప్రత్తి వుత్పత్తిదారులకు, నూలు మిల్లులకు, వ్యాపారస్థులకు సాంకేతిక సలహా లిస్తున్నారు. ఆ శాస్త్రవేత్త లింతవరకు చేసిన పరిశోధనల ఫలితాలను 120 కరపత్రాలలో ప్రచురించారు. అమెరికా తరువాత ఇండియాలో నే ప్రత్తి యెక్కువగా వుత్పత్తి అవుతున్నది. అయినా దేశంలోని 400 నూలు మిల్లులకు పని కలిపించే నిమిత్తం ఇండియా 15 లక్షల బేళ్ళనూలు విదేశాలనుంచి దిగుమతి చేసుకొంటున్నది. ఇందువల్ల ఇండియా ఏటేట 150 కోట్ల రూపాయలు వెచ్చించవలసి వస్తున్నది. అయితే గత అయిదేండ్లలో ఇండియాలో ప్రత్తిపంట 20 లక్షల బేళ్ళనుంచి 36 లక్షల బేళ్ళకు పెరగడం సంతోషించతగ్గ విషయం.

### రకరకాల ప్రత్తి

ఇండియాలో రకరకాల ప్రత్తి పండుతున్నది. ఈ ప్రత్తినుంచి పలువిరకంనూలు తయారు చేయవచ్చు. పరకొప్రత్తినుంచి ఏ రకం నూలు తయారు చేయవచ్చనే విషయంగురించి పరిశోధనలమీద పరిశోధనలు సాగించాలి. కనుక ప్రభుత్వ వ్యవసాయ శాఖవారు ఈ పరిశోధనాలయానికి పలురకాల ప్రత్తి నమూనాలో ఈ పరిశోధనాలయానికి పంపిస్తున్నారు. ఈ పరిశోధనాలయం ఆధ్వర్యాన 30 కేంద్రాలలో పరిశోధనలు జరుగుతున్నవి.

మిశ్రమ పద్ధతి మొదలయిన సాంకేతిక పద్ధతులద్వారా ఈ 30 కేంద్రాలలో కొత్త రకాల ప్రత్తి తయారు చేయబడుతున్నది. ఆ తరువాత ఈ సాంకేతిక పరిశోధనాలయం వారు ఆయా రకాలను పరిశీలించి, వేటిని ఏ ప్రాంతంలో పండించవలసిందీ రైతులకు సలహాలిస్తారు.

ఈ విధంగా ఏపుగా పెరిగి ఎక్కువ ప్రత్తినిచ్చే మొక్కలను రైతులు పెంచగలిగితే వారికి యిప్పటికంటె ఎక్కువ రాబడి వస్తుంది. నూలు మిల్లులకు మేలిరకం ప్రత్తి లభిస్తుందన్నమాట. ఈ పరిశోధనల ఫలితంగా 1947-48 లో 5 కోట్లు రాబడివచ్చిన ప్రత్తి పండించే రైతులకు 1950-51 లో 7 కోట్ల ఆదాయం వచ్చింది

నమూనాలను పరిశీలించడ మొకటే యీ పరిశోధనాలయం చేసే పనికాదు. ఎరువులు ఎటువంటివి వెయ్యాలి, ప్రత్తిపంటకు నీళ్ళ సప్లయి ఎలావుండాలి, అనే విషయాలలో కూడా ఈ పరిశోధనాలయంవారు రైతులకు సలహాలిస్తారు.

### పరిమితావకాశాలు

ఈ పరిశోధనాలయానికి ఇప్పటివున్న అవకాశాలు చాలా పరిమితం. కనుక ఇప్పటికది సాధించిన ఫలితాలు ప్రారంభ కృషి మాత్రమే నని పరిగణించబడుతున్నది. ఈపరిశోధనాలయంవల్ల సత్ఫలితాలు కలిగినవనడానికి ప్రత్తిలో అదికనిపెట్టిన క్రొత్త నమూనాలొకటే నిదర్శనాలు కావు. అనేక ఆధునిక ఉపకరణాలు, పద్ధతులు మొదలయిన వాటిని కూడా అక్కడి సాంకేతిక నిపుణులు కనిపెట్టారు.

ఈపరిశోధనాలయాల కార్యక్రమాలను ఇంకా విస్తృతం చెయ్యాలని డాక్టరు నంజుండయ్యగారి అభిప్రాయం ఆవిధంగా మాంచెస్టరులోని షర్లీఇన్స్టిట్యూట్ స్థాయికి, న్యూఆర్లియన్సులోని సదరన్ రీజనల్ రిసెర్చి లాబొరేటరీస్ స్థాయికి ఈ పరిశోధనాలయాన్ని తీసుకుపోవాలని ఆయన ఆశిస్తున్నారు (యు. ఎస్. ఐ. ఎస్.)

# అలెగ్జాండర్ గ్రాహమ్ బెల్

## 'టెలిఫోన్' కనిపెట్టినశాస్త్రవేత్తజీవితసంగ్రహం

సుమారు 77 సంవత్సరాల క్రిందట టెలిఫోను మనకు మాట్లాడసారంభించింది. అంతకుపూర్వం టెలిఫోను ద్వారా భాషాస్వరూప శబ్దాలు మాత్రమే వినపడేవి. ఆశబ్దాలుకూడా పసిపిల్లవాని వచ్చీరాని మాటలులాగా వుండేవి.

అయితే యీ సంఘటన పెద్ద ఆడంబరాలతో ప్రారంభం కాలేదు. అమెరికాలోని మసాచుసెట్స్ రాష్ట్రంలోని బోస్టన్ నగరంలో ఒకవాడిద్దరు యువకులు తీగలద్వారా విద్యుచ్ఛక్తిని పంపించి మనం మాట్లాడేమాటలు అవిద్యుత్తీగలద్వారా పంపించడానికి ప్రయత్నించారు. వారి కృషి సఫలమయింది కనుకనే వారిద్దరి పేర్లు లోకంలో చిరస్థాయిగా వుండడానికి వీలుగా ఒక కంచుఫలకమీద యిలా వ్రాయబడింది:

"1876 మార్చి 10 వ తేదీన ఇక్కడ అలెగ్జాండర్ గ్రాహమ్ బెల్ థామస్ అగస్టస్ వాట్సన్‌తో టెలిఫోనుద్వారా మొట్టమొదటిసారి చక్కగా మాట్లాడాడు." ఈ ఫలక యీనాటికీ అక్కడువున్నది.

అంటే టెలిఫోను కనిపెట్టిన శాస్త్రవేత్త అలెగ్జాండర్ గ్రాహమ్ బెల్ అన్నమాట. 29 యేండ్లు నిండి 30 వ యేట ఒకవారం గడుస్తూండగా బెల్ మొదటి టెలిఫోను కనిపెట్టాడు. ఆయనకు అప్పుడు పరిశోధనాలయంగా వినియోగపడినవి రెండు గదులు. అవికూడా ఆయన అప్పుడున్న బస లోని రెండుగదులు.

జన్మతః బెల్ స్కాటిష్ జాతివాడు అయితే ఆయన అమెరికన్ శాస్త్రవేత్తగా వినుతికెక్కాడు. ఈ వేళ (మార్చి 3 వ తేదీ) ఆయన 106 వ జన్మదినం. టెలిఫోను కనిపెట్టడంద్వారా ఆయన ప్రపంచాన్నే పూర్తిగా మార్చివేశాడు. ఆయన మేధాశక్తి ఫలితంగానే న్యూయార్కులోకూర్చుని ఈనాడు ప్రపంచంలో దాదాపు ఏ మూలనున్న వ్యక్తితో నైనా మాట్లాడడం సులభసాధ్యమయింది.

బెల్ టెలిఫోను కనిపెట్టిన తరువాత కొద్ది సంవత్సరాలలోనే బోస్టన్ నగరంలోని ప్రజలు న్యూయార్కు నగరంలోని వారితో టెలిఫోను ద్వారా మాట్లాడడం మొదలు పెట్టారు. ఈ రెండు నగరాలమధ్య దూరం 350 మైళ్లు. ఆ తరువాత 900 మైళ్ళ దూరంలోనున్న షికాగో నగరంలోని ప్రజలతో కూడా వారు మాట్లాడ కలిగారు. 1915 వ సంవత్సరం నాటికి ఉత్తర అమెరికాలో సుమారు 3,000 మైళ్ల దూరమున్న శాన్ ఫ్రాన్సిస్కో, కాలిఫోర్నియా, నగరాల మధ్య టెలిఫోను తీగెలు వేయబడినవి. మొట్టమొదటిసారి సముద్రానికి అటూయిటూ వున్న రెండు నగరాలమధ్య 20 సంవత్సరాలక్రితం టెలిఫోను సందేశం పంపించడం జరిగింది. ఆ నాడు న్యూయార్కు నగరం నుంచి, ఇంగ్లండులోని లండన్ నగరంలో ఒక వ్యక్తితో టెలిఫోను ద్వారా మొదటిసారి మాట్లాడడం జరిగింది.

### అమెరికాలో టెలిఫోన్లు

ఈనాడు అమెరికాలో సుమారు 4,55,00,000 టెలిఫోన్లున్నవి. అంటే ప్రతినలుగురికీ ఒక టెలిఫోనున్నదన్నమాట. సగటున రోజుకు సుమారు 20 కోట్ల సార్లు అమెరికన్లు టెలిఫోన్ వినియోగిస్తున్నారు.

ప్రముఖ శబ్దోచ్చారణశాస్త్రవేత్త అలెగ్జాండర్ మెల్‌విల్లీబెల్ అలెగ్జాండర్ గ్రాహమ్ బెల్ తండ్రి. జననం ఎడింబరోలో. ఎడింబరో విశ్వవిద్యాలయంలోను, లండనులోని యూనివర్సిటీ కాలేజిలోను గ్రాహమ్ బెల్ విద్యనభ్యసించాడు. విద్యపూర్తయిన కొద్ది కాలంలోనే గ్రాహంబెల్ తండ్రికి ఉపన్యాసవిద్య, కంఠస్వర శాస్త్ర బోధనలలో సహాయపడ నారంభించాడు. బధిరులకు మాటలు నేర్పేవిషయంలో బెల్ తనతండ్రికనిపెట్టిన పద్ధతిలో కొన్ని ప్రయోగాలు చేశాడు.

బధిరులకు విద్య నేర్పేవిషయంలో ఉపాధ్యాయులకు శిక్షణనివ్వమని బోస్టన్ పబ్లిక్ స్కూలు బోర్డువారు పంపించిన ఆహ్వానం పురస్కరించుకుని 1871 లో గ్రాహంబెల్ బోస్టన్ వెళ్ళాడు. ఆతరువాత ఈ విధానంలో శిక్షణ యివ్వవలసిందిగా అమెరికాలోని పలుపాఠశాలల యజమానులు ఆయనను కోరగా ఆ పద్ధతి నేర్పేటందుకాయనొక శిక్షణాలయం నెలకొల్పాడు.

విద్యుచ్ఛక్తిద్వారా మాట్లాడే పద్ధతొకటి కలదనేవిషయాన్ని 1865 లోనే బెల్ కనిపెట్టాడు. 1875 లో అనేకనిస్తంత్రీ తీగలున్న టెలిగ్రాఫ్ యంత్రంలో పనిచేస్తూండగా విద్యుత్తీగలద్వారా మాట్లాడి, ఆ మాటలను యథాతథంగా గ్రహించవచ్చని ఆయనకు తోచింది.

అనుదుసటి సంవత్సరం ఆయన ఆ పద్ధతిని చక్కగా అభివృద్ధి చేశాడు. కనుకనే తన సహోద్యోగి వాట్సన్‌తో ఆయన టెలిఫోన్ ద్వారా యిలా మాట్లాడాడు:

"మిస్టర్ వాట్సన్"

ఇక్కడికి రా, నీతో కొంచెం పనువ్నది. ఆమాటలు వాట్సన్‌కు స్పష్టంగా వినిపించినవి.

### బౌద్ధత్రిక ప్రదర్శనం

బెల్ కనిపెట్టిన ఈ టెలిఫోను మొట్ట మొదట 1876 మే 10 నే బోస్టన్ నగరంలోని అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్ట్సు అండ్ సైన్సెస్ వారి అధ్వర్యాన ప్రదర్శించబడింది. ఆ తరువాత ఫిలడెల్ఫియాలో అదే సంవత్సరం జరిగిన సెంటెనల్ ఎగ్జిబిషన్ లో టెలిఫోన్ ప్రదర్శించబడింది.

బెల్ టెలిఫోన్ కంపెనీ 1877 జులైలో నెలకొల్పబడింది. ఆతరువాత ఈ టెలిఫోనుకు పేటెంట్ హక్కులను గురించి కోర్టులలో పెద్ద వాదావాదం జరిగింది. అమెరికా సుప్రీమ్ కోర్టువారు బెల్ హక్కులను సమర్థించుచూ తీర్పు చెప్పారు.

ఈవిధంగా టెలిఫోన్ లు తయారు చేసి అమ్మకానికి కూడా వాటిని సిద్ధం చేయడం పూర్తయిన తరువాత బెల్ దృష్టి యితరవిషయాల పాకర్షించింది.

కాంతికిరణాల ద్వారా మాట్లాడడానికి వినియోగపడే ఫోటోఫోను గ్రాహమ్ బెల్ కనిపెట్టాడు. బధిరులకు విద్య నేర్పడానికి వినియోగపడే ఆడియోమీటర్ అనే సాధనాన్ని కూడా ఆయన కనిపెట్టాడు. ఇంకా అనేక శాస్త్రీయోపకరణాలను ఆయన కనుగొన్నాడు.

బధిరత్వాన్ని గురించి బెల్ అనేక పరిశోధనలు చేశాడు. బధిరుల స్వభావమేమిటి? కొంతమందికి చెముడు ఎందుకు వస్తున్నది? వారసత్వంగా ఎవరన్నా చెవిటివారవుతున్నారా అనే విషయాలనుగురించి ఆయన కొన్ని పరిశోధనలు చేశాడు. 1883 లో గ్రాహమ్ బెల్ "సైన్సు" అనే పత్రిక నెలకొల్పాడు. ఆతరువాత శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధికి వినియోగపడే అధికారపత్రికగా అది రూపొందింది. స్మిత్ సోనియన్ పరిశోధనా కేంద్రంలో ఆయనొక పరిశోధనాలయంకూడా నెలకొల్పాడు.

బెల్ తన చివరి పాతిక సంవత్సరాలలో వైమానిక విషయాలలో కృషి చేశాడు. ఆయన కేప్ బ్రిటన్ దీవిలో అనేకరకాల గాలిపటాలను చేసి పరీక్షిస్తూ ఆయన అనేక నెలలు గడిపేవాడు. ఒక క్రొత్త గాలిపటాన్ని కూడా ఆయన కనిపెట్టాడు.

1907 (ఏరియల్ ఎక్స్పెరిమెంట్ సంఘం) వైమానిక పరిశోధనా సంస్థాన్ని ఆయన ఏర్పాటు చేశాడు. ఆ సంఘం అధ్వర్యాన అనేకమంది శాస్త్రవేత్తలు అనేక పరిశోధనలు సాగించారు. (హైడ్రోఫైల్) నీళ్లమీద కూడా ప్రయాణం చేసే విమానం తయారుచేయడానికి వినియోగపడే సూత్రాన్ని వారు కనిపెట్టారు. బెల్ అసాధారణంగా పరిశ్రమించే వ్యక్తిగా ప్రతీతి కెక్కాడు. 1922 ఆగస్టు 2వ తేదీన ఆయన దివంగతుడు. ఆయన అమెరికా శాస్త్రీయ పరిశోధనారంగంలో బెల్ నెల పాలా ప్రాముఖ్యం వుంటేది.

టెలిఫోన్‌ను కనిపెట్టిన అలెగ్జాండర్ గ్రాహంబెల్ 1892లో తొలిసారి న్యూయార్కు నుంచి చికాగోకు టెలిఫోన్‌లో మాట్లాడుతున్నప్పటి దృశ్యం.

# ఇతరవిషయాలు వదలి కొరియా యుద్ధాన్ని వెంటనే ఆపివేయాలి

## సమితి రాజకీయసంఘంలో విషిన్‌స్కీ సూచన

సమితి కార్యాలయం, మార్చి 3: కొరియా యుద్ధాన్ని, ఎవరు ప్రారంభించారు, ఎవరు ఆయుధాలు అందచేశారు అన్న ప్రసక్తిలేకుండా, వెంటనే ఆపుచేయాలని సోవియట్ విదేశాంగమంత్రి ఆంద్రీ విషిన్‌స్కీ నిన్న రాజకీయ సంఘసమావేశంలో ఉద్ఘాటించారు. కొరియాలో యుద్ధం అంతం కావాలని కోరటమే కాదు. మేము దానిని ప్రతిపాదించాము అని అంటూ ఆయన అమెరికా ప్రతినిధి లాడ్జివంకకు తిరిగి 'కాని దానిని ముగించడం మీకిష్టంలేదు' అన్నారు.

దూరప్రాచ్యంలో అమెరికా అనుసరిస్తున్నది శాంతి సాధనావిధాన మేననే వ్యక్తి 'హాస్యగాడు' మాత్రమే అయి వుంటాడనీ, అమెరికాలో అధికారానికి వచ్చిన రిపబ్లికన్‌పార్టీ శాంతి సమర్థనకు కాక దానికి పూర్తిగా విరుద్ధమైన లక్ష్యాన్ని సాధించడానికే కృషి చేస్తున్నదనీ సోవియట్ విదేశాంగ మంత్రి ఆంద్రీ విషిన్‌స్కీ నేడు సమితి రాజకీయసంఘ సమావేశంలో అన్నారు.

'అమెరికా కొరియాను కోల్పోయిందంటే జపానును కూడా కోల్పోతుంది' అని జేమ్స్ వాన్ ఫ్లీట్ గతవారం శాన్ ఫ్రాన్సిస్కోలో అన్న మాటలను పురస్కరించుకొని 'మీరు జపానును తప్పక కోల్పోతారు. మహాశయులారా! బహుశా ఆసియా నంతనూ కోల్పోతారు. మీరేమి చేసినాసరే' అన్నారు విషిన్‌స్కీ.

రాజకీయ సంఘం నేడు కొరియాపై చర్చను కొనసాగించింది. విషిన్‌స్కీ, అమెరికా ప్రతినిధి వర్గ నాయకుడు హెన్రీ కాబట్‌లాడ్జి గతవారం అమెరికా కృషిఅంతా శాంతిసాధనకేనని అన్న దానికి సమాధానమివ్వడం మొదలు పెట్టారు. చైనా నడిగడ్డపై దండయాత్రి చేయడానికిగాను చాంగ్ కై షేక్‌కి ఆయుధాలు, ఓడలు, విమానాలు సప్లయి చేయడానికి అమెరికా ప్రభుత్వం సన్నద్ధమవుతోందని అమెరికన్ పత్రికలలో పడిన వ్యాసాలను విషిన్‌స్కీ ఉదహరించారు. ఇండో చైనాలో ఫ్రెంచి వారికీ, మలయాలో బ్రిటిష్‌వారికీ కూడా సహాయం అధికంగా చేయడానికి అమెరికా ఆయత్తమవుతున్నదని యీ వార్తలు తెలుపుతున్నాయన్నారు.

సోవియట్ యూనియన్ చైనాకు సహాయం చేస్తున్నదనేందుకు లాడ్జి పేర్కొన్న 10 అంశాలప్రసక్తి తెచ్చి ఎవ్వరూ దాచ ప్రయత్నించనిదానిని లాడ్జి వెల్లడించారనీ, ఆయనప్రసంగం కేవలం 'పుర కారు' తపంగావున్నదనీ విషిన్‌స్కీ అన్నారు. 90 నిమిషాలసేపు చేసినప్రసంగాన్ని ముగిస్తూ, కొరియావిషయంలో తాము క్రితంసారి ప్రతిపాదించిన తీర్మానాన్నే తిరిగి ప్రతిపాదిస్తున్నామని విషిన్‌స్కీ అన్నారు.

అంతకుముందు ఇదివరలో భారతదేశం ప్రతిపాదించిన తీర్మానాన్ని చైనా, ఉత్తరకొరియాలు తిరస్కరించడం ఉచితంగానే ఉన్నదన్నారు. ఆ తీర్మానాన్ని పీకింగ్‌కు పంపుతూ, అది సాధారణసభ శాంత్యభిలాషను వెల్లడిస్తున్నట్లు వ్యాఖ్యానించడంద్వారా అధ్యక్షుడు పియర్సన్ దానికి అపార్థం కల్పించారన్నారు. వాస్తవమైన శాంత్యభిలాషను వెల్లడించినది. తక్షణమే యుద్ధం నిలుపుచేయాలని కోరే సోవియట్ తీర్మానమేననీ, దానిని సభ తిరస్కరించిందనీ అన్నారు.

పిమ్మట రాజకీయసంఘం, విషిన్‌స్కీ వ్యతిరేకం తెలిపినప్పటికీ ఈ విషయమై చర్చను బుధవారం సాయంత్రం పూర్తిచేయాలని నిర్ణయించింది.

# కొరియాపై సమితి రాజకీయసంఘపరిస్థితి

సమితి కార్యాలయం, మార్చి 2: కొరియా సమస్య సందర్భంలో సమితి రాజకీయసంఘ పరిస్థితిని గురించి చర్చించేందుకు అరబ్బు, ఆసియా బృందం బుధవారంనాడు సమావేశం కానున్నది.

సాధారణసభ సమావేశం ప్రారంభమైనాక వీరి సమావేశం జరగటం ఇదె మొదలు. విషిన్‌స్కీ ఉపన్యాసంతో తిరిగి ఏర్పడిన ప్రతిష్టంభనం దృష్ట్యా బృందం వహించవలసిన వైఖరి ఈ సమావేశంలో నిశ్చయం కావచ్చును.

# గుంటూరు జిల్లాలో కంపోస్టు ఎరువులు

## అధికంగా ఉత్పత్తిచేసినవారికి ప్రశంసా పత్రాలు

గుంటూరు, మార్చి 2: క్రితం సంవత్సరం అక్టోబరు 2వ తేదీ లగాయతూ 8 వ తేదీవరకూ, మహాత్ముని వారంరోజుల్లో, కంపోస్టు ఎరువులను అధికంగా తయారుచేసిన రైతులకి, నిన్న జిల్లాకలెక్టరు కృష్ణస్వామిగారి అధ్యక్షతన కలెక్టరు కార్యాలయంలో జరిగిన జిల్లా ఆహారోత్పత్తి సంఘ సమావేశంలో ప్రశంసాపత్రాలు బహూకరించారు. యీ ప్రశంసా పత్రా లందుకొన్నవారు శ్రీయుతులు పి. లక్ష్మయ్య (రేపల్లెతాలూకా) పి. హనుమారెడ్డి (సత్తెనపల్లి తాలూకా) కె. కృష్ణారావు (తెనాలితాలూకా) యం. అంకన్న (గుంటూరు తాలూకా.)

ఈ సమావేశానికి, అధికార, అనధికార ప్రముఖులనేకులు హాజరైనారు.

# కృష్ణాపై రెగ్యులేటర్ బ్రిడ్జి నిర్మాణం

## వాయిదా వెయ్యరాదని శాసనసభ్యుని విజ్ఞప్తి

విజయవాడ, మార్చి 3. కృష్ణానదిపై రెగ్యులేటర్, రోడ్, బ్రిడ్జి నిర్మాణం రాష్ట్రప్రభుత్వం వాయిదా వెయ్యటం అన్యాయమంటూ మద్రాసు శాసనసభ్యులు టి. పోతరాజుగారొక ప్రకటన చేస్తున్నారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడనున్న దిన్నె సందర్భంలో ఈ నిర్మాణ పథకాన్ని వాయిదా వెయ్యడం అన్యాయం గనుక ఆకార్యక్రమం సత్వరం అమలు జరగడానికి ఆంధ్రులు తీవ్రంగా ఆందోళన సాగించాలని పోతరాజుగారు ఆప్రకటనలో విజ్ఞప్తి చేస్తున్నారు.

పార్లమెంటు సభ్యులు శ్రీ ఛటోపాధ్యాయ, తామూ కృష్ణ ఆనకట్ట మరమ్మతులు ప్రస్తుతం ఎలా జరుగుతువన్నవో చూడడానికి వెళ్ళినప్పుడు అక్కడి ఇంజనీర్లు ఈమరమ్మతులు ఆనకట్టలో మూడవభాగానికి మాత్రమే జరుగుతున్నవనీ, రెగ్యులేటర్ రోడ్ బ్రిడ్జి నిర్మిస్తే తప్ప అనకట్టకు సరైన భద్రత ఏర్పడదనీ వారికి తెలియచెశారట. ఈ రెగ్యులేటర్ రోడ్ బ్రిడ్జీ నిర్మాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయమని ప్రభుత్వపుటుత్తరువుల కోరకు చూస్తున్నామనీ కూడా ఆ ఇంజనీర్లు వారికి చెప్పారని పోతరాజుగారు ఆ ప్రకటనలో వివరించారు. ఈరోజు రెగ్యులేటర్ బ్రిడ్జి నిర్మాణం వెంటనే జరిపించమని అభ్యర్థిస్తూ ముఖ్యమంత్రికీ పబ్లిక్ వర్క్సు మంత్రికీ తంతివార్తలు పంపామని పోతరాజుగారు ఆ ప్రకటనలో ఆంధ్రులకు విజ్ఞప్తి చేస్తున్నారు.

# మైసూరు అర్చకులకు బంగారు గొలుసుల దానం

మైసూరు, మార్చి 2. మైసూరు మహారాజుగారు తమకుపుత్రోత్సవమైన సంతోష సందర్భం పురస్కరించుకొని నిన్నటిదినం 24 మంది గుడిపూజార్లకు ఒక్కొక్కరికి మూడేసి తులాల బంగారు గొలుసులను బహూకరించారు. (స్వ. వి.)

# చేనేత పరిశ్రమకు సంపూర్ణ ప్రోత్సాహం

గాంధీగ్రాం (మధుర), మార్చి 3: ఇక్కడికి సమీపంలో వున్న చిన్నాలపట్టి అనే గ్రామంలో చేనేతపారిశ్రామికులే ఎక్కువ వుందున్నారు. ఈనేళ సాయంకాలం అక్కడ జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారిలా అన్నారు:

"చేనేత పారిశ్రామికులకు సహాయంగా ఏమి చేయడానికైనా నేను సిద్ధమే. ప్రస్తుతం మీరు పడుతున్న ఇబ్బందులు ప్రభుత్వానికి తెలుసు. ఇవి తాత్కాలికావస్థ లేనని ఆశిస్తున్నాను. మీకు సహాయపడే నిమిత్తం అవసరమైతే దేశంలోని గుడ్డల మిల్లులన్నీ మూసివెయ్యవలన్నా మూసివెయ్యడానికి నేను సిద్ధమే అయితే గుడ్డల మిల్లుల పరిశ్రమకు దేశంలో చాలా పలుకుబడివున్నది. కనుక అపరిశ్రమతో వ్యవహరించేటప్పుడు కొంచెం జాగ్రత్తగావుండాలి.

"తక్షణం ఏదో సహాయ పడతామని చెప్పే స్వార్థదృష్టిగల పార్టీల మాటలు నమ్మి అనవసరంగా అశాంతి పెంపొందించకండి. నా చేతనైనదంతా చేస్తానని మీకు వాగ్దానం చేస్తున్నాను. ఇక మీరు మీవాళ్ళను ఇంకా అభివృద్ధి చేసుకొని ఐకమత్యం పెంపొందించుకునే వాలోను, నా ప్రభుత్వం మీద విశ్వాసం వుంచాలి.

"నిగ్రహంతో, ధైర్యంతో ప్రజలు ప్రస్తుత కష్టాలను సహించితే మంచి రోజులు రాగలవు. ఈ కష్టాలు కలకాలం నిలవబోవు. మీ విధి మీరు సక్రమంగా నిర్వహించండి. ప్రతి చిన్న పనికీ ప్రభుత్వం మీద ఆధారపడకండి.

"కాంగ్రెసు చాలా గొప్ప సంస్థ. గత 50 సంవత్సరాలనుంచి నేనందులో పనిచేస్తున్నాను. కాంగ్రెసు సమష్టి కుటుంబంలాంటిది. ప్రతివారికి అందులో స్థానం వున్నది.

"ప్రతివారు అందులో చేరి దేశాభ్యున్నతికి కృషి చేయవచ్చు. అయితే కాంగ్రెసు మీద మరొక బాధ్యత కూడా వున్నది. తనప్రతిష్ఠను కాంగ్రెసు కాపాడుకోవాలి. ఆ ప్రతిష్ఠకు భంగం కలిగించే పనేమీ కాంగ్రెసు చెయ్యరాదు. ఎంతమంది సభ్యులున్నా ఈప్రతిష్ఠకుంటకలిసిన తరువాత కాంగ్రెసు చెయ్యగలిగిందేమీవుండదు. కాంగ్రెసు సత్ప్రఖ్యాతులను కాపాడడానికి ప్రతి కాంగ్రెసువాది కృషి చెయ్యాలి." పి. టి. ఐ.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.